# తొలిపలుకు

ఉపాధ్యాయులారా!

ఈసదుపదేశకథలు, బాలురకుఁ జక్కఁగాఁ దెలియునట్టి సులభశైలిని నాలుగు భాగములుగా రచియింపఁ బడినవి. ఈసదుపదేశము లన్నియుఁ గథామూలకములు. ఉపదేశములు గథామూలములగుచో బాలురకుఁ బఠనీయములు. బోధనీయములు. ఇది యుపాధ్యాయ సంఘమునకు విదితము. ఇందు వివిధములగు కథలుగలవు. కొన్ని పౌరాణికములు. కొన్ని కల్పితములు. కొన్ని చరిత్రాత్మకములు. కొన్ని యెడల నొక భాగమునఁ దెలుపంబడిన కథలే వేఱొక భాగమునఁ దెలుపఁబడినవి. ఇందుకుఁ గథా విపులీకరణమే మూలకారణమనియెఱుంగునది. మఱియునిట్టికథామూలకంబులగు నుపవాచకఁబు లెన్నియేనియు బాలురకొఱకిదివఱకే పుట్టియున్నవి. ఇట్లు పుట్టుటకు వ్యక్తుల యభిరుచులే ప్రధాన కారణములు. అయిన నొకదాని యుత్కృష్టత యింకొకదానికిరాదు. ఉత్కృష్టతనుబట్టియే ప్రాశస్త్యము గలుగుచుండును. కావున నీసదుపదేశకథల గుఱించిప్రత్యేకముగాఁ జెప్పుటనవసరము. బోధకులే వీని ప్రాశస్త్యమును నిర్ణయింతురుగాక!

# విషయసూచిక





# సదుపదేశకథలు

## నాలవ భాగము.

### ౧ భగవన్మహిమ

బాలకులారా! మన మందఱము మున్ను చేసిన పుణ్యకర్మంబులవలన నిప్పుడీ మానవజన్మము నెత్తితిమి. అన్ని జన్మంబులయందును మానవజన్మమే యుత్తమమని పెద్దలు చెప్పుదురు. అట్టి మానవజన్మమెత్తిన మన మందఱము మానవోచితకృత్యంబుల నొనర్చుచు జన్మసాఫల్యము నొందవలసియున్నది. ఉచితకార్యంబుల నొనర్చుటయేగాక చేతనగునంతవఱకు మానవోచిత ధర్మమార్గావలంబకులమై మెలఁగుట మన కెల్లరకు విధియైయున్నది. అటుల ధర్మమార్గమున మెలంగుటకు ముందు మానవధర్మములఁ గొంత వఱకుఁ దెలిసికొనవలయును గదా? మానవధర్మముల సాంతముగా నెఱుంగుట యసాధ్యమైన పనిగాదు. అట్టి యత్నమునకు మన జీవితమునంతయు వినియోగించినను కృతకృత్యులము కాజాలము. అట్లని యేమియు నెఱుగ

కుండుటయు మంచిదికాదు. కావున సాధ్యమగునంతవఱకుఁ గొన్నింటినేని నెఱుంగట యుక్తము.

భూమిపై జన్మించిన ప్రతిమానవునకుఁ దొలుదొల్త భగవన్మహిమను గూర్చి కొంతవఱకేనియుఁ దెలిసికొనుట ముఖ్యావశ్యకమై యున్నది. భగవన్మహిమ నెఱుంగుటయన సులభమైన పనిగాదు. దానికి మొదలిది తుదియిది యని యెవ్వరును జెప్పఁజాలరు. భగవంతునకెట్టుల నాదిమధ్యాంతములులేవో తన్మహిమమునకు నట్లే యాదిమధ్యాంతములు లేవు. కాని వానిని మనమేర్పఱచుకొని కొంతవఱకు గుర్తెఱుఁగుట మనకు విధియై యున్నది. ఎల్లరును దమ్ము సృజియించినవాని నెల్లప్పుడు గీర్తించు చుండవలయునే కాని యాపదలు వచ్చినప్పుడు భగవంతుని రక్షింపుమని ప్రార్థించుచు నాపదలు దొలంగిన మఱచిపోవుచు నుండుట మేలుగాదు. కాని ప్రస్తుతము లోకమంతయు నీవిధముగా మెలంగుచున్నది. భగవంతుఁ డేనియుఁ దన్ను స్మరించినను స్మరింపక పోయినను నొకకంట నెల్లరఁ గనిపెట్టుచునే యున్నాఁడు. మానవుఁడు తన జీవితమున భగవంతుని నామోచ్చారణ మెట్టిదో యెఱుంగక పోయినను నాతఁడు కోపించుటలేదు. ఎన్ని దుర్మార్గకార్యము లాచరించినను సహించుచునే యున్నాఁడు. అట్లుండుటయేగాక తన్ను బొత్తిగా నెఱుంగని

వానినేనియు, నెంత దుర్మార్గవర్తను నేనియు, నొక్కపరి జీవితాంతమందేని నిశ్చలభక్తితో నేమూలమునకైన నేమి తన్నొక్కపరి ప్రార్థించినచో నట్టివానినిఁ దన వంకకుఁ జేర్చు కొనుచున్నాఁడు. భగవన్మహిమయన నిటులే యుండును. ఈవృంత్తాంతమును దేటతెల్లముగా నొనర్చునట్టి యుపాఖ్యానం బొండుగలదు. బాలకులారా! అద్దానిని మీకుఁ దెలియఁజెప్పెద వినుండు.

## —॥ అజామిళుడు ॥—

పూర్వకాలమునఁ గన్యాకుబ్జపురమునందొక బ్రాహ్మణుఁడు గలడు. ఆతని పేరు అజామిళుఁడు. అతఁడు సత్కులంబునఁ బుట్టినవాఁడగుటవలన మొదటినుండియుఁ గులాచారమును దప్పక వర్తించుచుఁ దగిన కాలమున విద్యాభ్యాసమునకుఁ గడంగెను. మంచి గ్రహణశక్తి కలవాఁడును, మేధావియు నగుటవలన నచిరకాలంబుననే సకలవేదంబుల నభ్యసించెను. వర్ణాశ్రమ గూడఁ జక్కగా నెఱపుచు బ్రహ్మచర్యమును ముగించి గృహస్థాశ్రమమును స్వీకరించెను. నాటనుండి యాభూసురుఁడు

గీ. సత్యభాషణనియమంబు ♦ జరపినాఁడు
నిత్యనైమిత్తికాదుల ♦ నెఱపినాఁడు
దండిలోభాదిగుణముల ♦ దరపినాఁడు
మంచిగుణములు దనయందు ♦ మరపినాఁడు

ఈ విధముగా నజామిళుఁడు ధర్మమార్గంబునఁ బ్రవర్తించుచు సతతాచారసముచిత హృదయంబున సుజ్ఞాన సంతుష్టుఁడై తేజరిల్లెను. కాని యాతనికిఁ జెడుకాలము ప్రాప్త మగుచుండెను. ధర్మపరాయణుండగు నావిప్రవరుని చరిత్ర మంతయు మారిపోవు స్థితి సంభవింప నుండెను.

అజామిళుఁ డొకనాఁడు తండ్రి యాజ్ఞాపరిపాలనంబున సమిత్పుష్ప ఫలార్థంబుకై వనంబున కరిగెను. అచ్చోటనాతఁడు పలయువానిని సేకరించుకొని మగిడి గృహంబున కరుగుచుండుచు మార్గమధ్యంబున నొక లతాగృహంబున సురతక్రీడలందేలి యాడుచున్న కాముకీ కాముకులను గాంచెను. అందున్న కాముకి వృషలి యను పేరునంబరగు నొక నీచకులాంగన. ఆకాముకిమొనర్చు హావభావ విలాసములకును, వారిరువురు నొనర్చుచున్న శృంగారచేష్టలకును, నాతన్వంగి మనోహర రూపలావణ్య యౌవనంబులకును, నాబ్రాహ్మణుని మనస్సు చలించిపోయెను. అప్పటి కప్పుడె యాతనియందు మన్మథ వికారంబు పొడకట్టుచుండెను.

అతనికి లోకమంతయు నొక కారాగృహంబువలెను, నా కాముకికి కాముకులే తద్గృహంబున మెలంగు పురాణ పురుషులుగను గానవచ్చుచుండెను. ఒక్క గడియ కాలముననే ధర్మశీలుండగు నావిప్రసనుని బుద్ధియంతయు మారిపోయెను. ధర్మవర్తన మంతయు నశించెను. కులాచారము మాయమయ్యెను. బ్రాహ్మణ్యము మంట గలిసెను. చిత్తమంతయు వృషలీ మోహపాశా నిబద్ధమై పోయెను.

అవ్విధమున నజామిళుని హృదయమును మగల్చుకొనంజాలక యాతొత్తు సంటఁగట్టుకొని యదిమొదలు దుర్మార్గవృత్తికిఁ బాల్పడెను. పితార్జితము లన్నియు దాని పాలొనర్చెను. సజ్జనుల బాధలఁబెట్టెను. దొంగలఁ గొట్టసాగెను. నిందలకుఁ దలయొగ్గెను. తనకన్న దక్కువవారిని హింసింపఁ జొచ్చెను. జూదంబు లాడ నేర్చెను. దుర్వాదంబు లొనర్పసాగెను. ఇవి యవి యననేల? ఆతఁడొనర్పని దుష్కార్యమే లేకుండెను. ఇన్ని విధముల గడించి తెచ్చిన విత్తంబు నంతయు వృషలి కర్పించుచు దానినే యాత్మపత్నిగాఁ దలంచుచు సాధులక్షణ గుణవృత్తినంతయు విడిచి స్త్రీలోలుండై వర్తించుచుండెను. ఆహా! మంచివాఁడని యెన్నంబడిన యాభూసురుని చరిత్రయెంత నీచమైపోయెను.

సీ॥ సముచిత శ్రుతిచర్చఁ జర్చింపనొల్లక
సతికుచద్వయచర్చఁ జర్చసేయుఁ

దర్క-కర్క-శపార తర్కంబుగాదని
కలికితోఁ బ్రణయ తర్కంబుసేయు
స్మృతిపదవాక్యసంగతి గాక తత్సతి
పదవాక్యసంగతి పరగఁజేయు
నాటకాలంకార నైపుణంబుడిగి త
న్నాటకాలంకార వాటిదిరుగుఁ
గీ॥ బరగఁ జిరకాలమీరీతిఁ బాపనియతి
రమణదాసీకుటుంబ భారమువహించి
యదికుటుంబినిగాగఁ బాపాత్ముఁడగుచు
నశుచియును దుష్టవర్తనుఁడై మెలంగె.

ఇత్తెఱంగున నజామిళుండు వృషలితోఁ గాపురం బొనర్చుచుఁ గొడుకులఁ బదుగురఁ బడసెను. ఇహామే శాశ్వతంబని యాతండు భగవంతుని మఱచి వర్తించునెడఁ గొంత కాలంబునకు శరీరపాటవంబు సన్నగిలుడు వృద్ధాప్య మంకురించెను. అంతటితోఁ గామకళావ్యాపారంబు క్రమక్రమంబుగా నంతరించి యతనికిఁ దుదకు మరణకాల మాసన్నమయ్యెను. అప్పుడేనియు నాతఁడుతనదుశ్చరిత్రంబు నొక్కపరి చిలకించిన వాఁడుగాడు. అప్పుడేనియు నీషణత్రయం బాతనివీడినదిగాదు. అప్పుడేనియు నాతనియందు భగవచ్చింతన పొడసూపినదికాదు. అప్పుడేనియు నాతనికి వైరాగ్యము కలిగినదికాదు. అట్టియెడ నాతనికి మృత్యు

వాసన్నంబగుడు భయంకరాకారులగు యమభటులు మువ్వు రాతని దృష్టికిం గోచరంబైరి. అప్పుడు వారలం గనుంగొని తానింకం జచ్చిపోనున్నవాఁడని వికలేంద్రియుండును, వికంపిత ప్రాణుండును, వికృతలోచనుండును, విహ్వలాత్మకుండును, నగుచు నారాయణాఖ్యంబరగు గనిష్టపుత్రునిమీఁది మోహంబును వీడఁజాలక యజామిళుండు,

కం॥ దూరమున నాడు బాలుఁడు
బోరనఁ దనచిత్తసీమఁ ♦ బొడఁగట్టిన నో
నారాయణ నారాయణ
నారాయణ యనుచు నాత్మ ♦ నందను నొడివెన్.

ఇవ్విధంబునఁ బాపాత్ముండగు నాతఁడు నిజపుత్రునిఁ దలంచెనే కాని యంత్యకాలంబునందేనియు నోరార నాపరమాత్మునిఁ దలంచిన వాఁడుగాఁడు. కాని సర్వమయుండగు శ్రీమన్నారాయణుండు మరణకాలమునఁ దన్నుచ్చరించుచున్న యాభూసురుని యార్తారవము నాలకించి, యాతండెంత దుర్మార్గుఁడైనను దన్ను స్మరించినవాఁడగుటవలనఁ గృపాళుఁడై యాతని రక్షింప సమకట్టి యతనిం గొనితేర తన దూతలఁబంపెను. అంతకుమున్నే యమదూతలాతనిఁ గొనిపోవుటవలన విష్ణుదూతలు మార్గమధ్యంబుననే వారల నడ్డగించి యాతనిని యమపాశావిముక్తునిగ నొనర్చిరి. అప్పుడు యమదూతలు వారలఁగాంచి "అయ్యలారా! మీ

రెవ్వరో మే మెఱుంగము. మేము యమదూతలము. ఈతఁ డగ్రికులంబునజన్మించి నీచస్త్రీలోలుఁడై స్వకులాచారంబుల మంటఁగలిపి జీవితము నంతయుఁ బాపమార్గంబునఁ గడపిన వాఁడగుటవలన నట్టివానిఁ దగినట్లు శిక్షించుటకై మావిభుని పంపున మేమీతనిఁ గొనిపోవుచుంటిమి. అట్టి మమ్మును మీరెదిర్చి యీదుశ్చరిత్రుని విడిపించుట ధర్మముగాదు. ఈతఁడెఱిగి చేసినది యొక్క ధర్మకార్యమైనను లేదు. అట్టి వానిని మీరు విడిపింప నేల? మీయాకారములఁ బట్టిచూడ మీరు ధర్మవిధులని తెలియుచున్నది. కావున మీకు మేము చెప్పనక్కఱలేదు" అని పలికిరి.

అప్పుడు విష్ణుదూతలు యమదూతలంగాంచి "ఓయీ! మీరీతనిఁ బాపకర్ముండనిగదా కొనిపోవుచున్నది. అవును. ఈతఁడు బాపకర్ముఁడే యగుగాక! దుష్కార్యము లొనర్చిన వాఁడేయగుఁగాక! హరి గుణకీర్తనము వలన నెల్లపాపంబులు నమసిపోవును గదా? హరికీర్తన ప్రభావము మీకుమాత్రము తెలియదా? అట్టి హరికీర్తనము నీతఁడు జీవితమధ్యంబున నెఱుఁగక పోయినను మరణకాలమున నామహాత్మునిఁ గీర్తించియున్నవాఁడు. కాని యాకీర్తనము నిజసుతునిఁ బిలచుటయే కాని భగవంతునిఁ బిలచుట కాదని తలంతురేమో,

కం॥ డెందంబు పుత్రువలనం
జెందినదని తలఁపవలదు ! శ్రీపతి పేరే

చందమునఁ బలుకఁ గలిగిన
నందకధరుఁ డందుఁ గలఁడు | నాథుండగుచున్.

కావున హరినామ సంకీర్తనంబు వలన నీతఁడొనర్చిన నీచకార్యము లన్నియు సమసిపోవుటయేగాక యీతనికిఁ గేవలము వైకుంఠలోకప్రాప్తి చేకూరియున్నది. అట్టియెడఁ బాపులకుంబోలె నీతని దండింప మీరు కొనిపోవుచుండ నెదిరింపకుండ మేమెట్లుండఁ గలము? మావిభుని భక్తుల కగ్గలుగు చున్నప్పుడు మేముచూచి యోర్వఁగలమా? అదిగాక—

మ॥ నిరతంబై నిరవద్యమై నిఖిలచిన్నిర్మాణమై నిత్యమై
నిరహంకార గుణాఢ్యమై నియమమై నిర్దోషమైనట్టి శ్రీ
హరినామ స్మరణామృతంబితఁడు ప్రత్యక్షంబు సేవించెఁ దా
మరణాంతంబున నిట్టి సజ్జనుని ధర్మంబేల వ్యర్థంబగున్

అని యివ్విధంబున భగవద్దూతలు భగవన్మహిమంబును దెలియఁజెప్పిన విని యమదూత లజామిళుని విడనాడి నిజలోకంబునకుం జనిరి. అప్పు డజామిళుఁడు యామ్యపాశబంధ విముక్తుండై కలహాపెట్టింగి పరమాత్మ ప్రభావంబును మాటిమాటికిఁ జింతించుచుఁ బుణ్యలోకంబునొందె.

కావున, ఓ బాలకులారా! ఈకథవలన మనకు భగవన్మహిమ యన నెట్టిదో తెలియుచున్నదిగదా? కనుక మన

మందఱము శ్రీమన్నారాయణుని మరువక యాతని నెల్లప్పుడు కీర్తించుచుండ వలయును.

---

## ౨ అహంకారము తగదు

బాలకులారా! మానవు డెంతవాఁడైనను నాతని కహంకారము తగదు. అహంకారము వలన నొకప్పుడెదికిరి నపకార మొనర్చిన వాఁడగుటయేగాక తన్ను దానవమానించు కొనినవాఁడును గూడనగును. అట్టి యహంకారము నణంచుకొనవలయు ననిన మానవుఁగు ముందు తన్నుదా నెఱుంగ వలయును. తన్నుదా నెఱుంగునప్పు డితరుల శక్తినిగూడ గమనింప వలయును. ఇతరుల శక్తిని గురుతించుట యన సాధ్యమైన పనిగాదు. పైకి నశక్తునివలెఁ గన్పట్టుచు నిక్కముగ శక్తిగలవారుగాఁ గొందరు గన్పట్టుదురు. అట్టియెడ మనుజుఁడు తన శక్తి నెఱింగి యెదిరి శక్తి నిజబలంబుకంటెను నత్యల్పమని భావించి యట్టివాని నెదిరింపఁ గూడదు. అట్లెదిర్చిన నెదిరికిఁ గీడు సంభవింపక పోవుటయేగాక మీఁదుమిక్కిలి తనకే పలుకరాని యవమానము సంఘటిల్ల వచ్చును. అట్లగుటయేగాక యొకొక్కప్పుడు తానెదిర్చినవాని కాళ్ళు తన ప్రాణరక్షణమునకై పట్టవలసి వచ్చును. అట్టియెడ మానవున కెంతటి తలవంపు

గలుగునో చెప్పనగునా? ఈవృత్తాంతమున కనుగుణ్యంబగు నొక గాధకలదు. తెల్పెదవినుండు.

—॥ అంబరీష, దుర్వాస ॥—

తొల్లి యంబరీషుఁడను నొక రాజచంద్రుఁడు గలఁడు. ఆతఁడు విష్ణుభక్తి పరాయణుండై తత్ప్రభావంబు వలన రాజర్షినాఁబరగి సకలలోక కీర్తనీయుఁడై యుండెను. ఆతఁడు గొంతకాలము సంసార సౌఖ్యముల ననుభవించిన యనంతర మిహాముసం దాసమాని కేవలము హరిగుణకీర్తన వ్యాపారమున మునింగి కాలమును గడపుచుండెను. ఆతనికిఁగల భక్తి తాత్పర్యము మిగుల వర్ణనాతీతము.

సీ॥ చిత్తంబు మధురిపు ♦ శ్రీపాదములయంద
పలుకులు హరిగుణ ♦ పఠనమంద
కరములు విష్ణు మంది ♦ ర మార్జనములంద
శ్రవణముల్ హరికథా ♦ శ్రవణమంద
చూపులు గోవింద ♦ రూపవీక్షణమంద
శిరము కేశవ నమ ♦ స్కృతులయంద
పదము లీశ్వరగేహ ♦ పరిసర్పరణములంద
కామంబు చక్రి కైం ♦ కర్యమంద
గీ॥ సంగమచ్యుతు నిజగుణ ♦ సంగమంద
ఘ్రాణమసురారి భక్తాంఘ్రి ♦ కమలమంద

రసన తులసీదళములంద • రతులుపుణ్య
సంగతులయంద యారాజ • చంద్రమునకు.

ఇట్టి పరమభాగవత శిఖామణియగు నంబరీషుఁడు నిజసతీమణి తోడి నీడకైవడి మెలంగుచుండ ద్వాదశీవ్రత దీక్షాపర తంత్రుఁడై క్రమంబు దప్పక వ్రతాంతంబునందుఁ గార్తికంబున మూడు రాత్రులుపవసించి కాళిందీజల స్నాన మొనర్చి భూసుర ప్రకరంబులకు భూరిదక్షిణలును, గోభూ హిరణ్య దానంబులును, నొసంగినయనంతరము నియమిత కాలంబునఁ బారణంబు సేయ నుద్యోగించునెడ మేనివి భూతి ధారణంబు శివావతారంబును బురుడింపఁ జాపులు తపఃప్రభావమును దెలుప, ఘన తపో యోగాభ్యాస విలాస రవిభాసుఁడగు దుర్వాసుఁ డమ్మహీనాథుని సదనంబున కరుగు దెంచెను. అట్లు సకాలంబునకు వచ్చిన యమ్మునిఁ జంద్రిన కంబరీషుఁడు సాష్టాంగ దండప్రణామ మొనర్చి, యర్ఘ్యపాద్యాదు లొసంగి 'దేవా! మీరాక మాకు శుభా వహంబు. నేటి ద్వాదశీపారణంబునకు మీరును రావల యును. కావున సత్వరంబ స్నానమొనర్చి రండు' అని యాతం డమ్ముని వల్లభునిఁ బ్రార్థింప దుర్వాసుండును వల్లె యని స్నానార్థమై నదికరిగి యచ్చోటఁ దనలో దాను 'ఏమీ! ఈతండు హరి భక్తి పరాయణుండనని మిట్టి పడుచు

న్నవాఁడు. ఈతని భక్తి మహిమ యెట్టిదియో నేడు పరీక్షించి మదీయ తపోబలంబువలన నీతని నవమానించి పోవలయు'నని యనుకొని జలంబునఁ గాలయాపన మొనర్చుచుండె.

అచ్చోట దూర్వాసుఁ డత్తెఱంగున మసలుచుండ నిచ్చోట నంబరీషుఁడు మునిరామికి వగచుచుఁ బారణంబునకు నియమితకాలంబు డగ్గఱిన కొలంది తహతహ పడుచు, నతిథి సత్కార మొనర్పక ముందు తానుగుడిచిన నధర్మమని దిగులొందుచు, తపో మహిమాన్వితుఁడగు నమ్మునికుంజరుఁ డేమన్ననోయని భయపడుచు నేమియుఁ దోచక యుండె. అక్కడ దుర్వాసుఁడు జాగుసేయఁ దొడంగె. ఇక్కడ నియమితకాలము సమీపించిన కొలంది యంబరీషుఁడు వ్రతభంగమగునేమో యని చింతింపఁ దొడంగె. అందరును మునిరాకకై యెదురు చూచుచుండిరి. కాని యాతఁ డెంతవఱకును రాకుండెను. నియమితకాల మొక్క గడియమాత్రమే యుండెను. అప్పుడంబరీషుఁ డచ్చట నున్నవారలఁ జూచి 'అయ్యలారా! ముని స్నానమునకరిగి రాకుండెను. నియమిత కాలమంతయు గడచిపోవుచుండెను. ఇంకొక్క గడియలోనఁ బారణ మొనర్ప వలయును. అట్లొనర్చిన నతిథి పూజాధర్మమును దప్పి నవాడనగు

సును. ఒప్పుకొనకున్న నాకు వ్రతభంగమగును. ఇందేది సమ్మతమో ధర్మప్రకారమాలోచింపుడు' అని పలికిన నా బ్రాహ్మణులందఱును దమలోఁ దాము ధర్మవిచారణ మొనర్చి యాతనితో—

ఆ. వె॥ అతిథి పోయిరాఁమి । నధిప యీద్వాదశీ
పారణంబు మానఁ । బాడిగాదు
గుడువ కుండఁగాదు । కుడుచుటయును గాదు
సలిల భక్షణంబు । సమ్మతంబు.

అని తెలియం బలికిన నాతండు వ్రతభంగంబు గాకుండ జలాపాన మొనర్చి మునిరాకకై యెదురు సూచుచుండెను.

అంతఁ గొంత కాలంబు సనిన పిదప దుర్వాసుండు స్నాన మొనర్చి, యంబరీషునకు వ్రతభంగము గాకుండెనా యని తనలోఁ దాను తర్కించుకొనుచు నమ్మహీకాంతుని గన్గొనఁ జనెను. ఆతండును దగినవిధి సన్మానించి భోజనంబునకు లెండని పలికిన విని యమ్మునీశ్వరుండాతని ముఖ వైఖరిం బట్టి యాతనికి వ్రతభంగము గాలేదని యనుమానించి తన దివ్యదృష్టివలన వృత్తాంతం బెఱయి నెఱింగి ముక్కోపి యగు నాతండు రోషకషాయిత లోచనుండై 'ఓరీ! దుర్మతీ! ఎంతయపకార మొనర్చితిరా? నన్ను గుడువ రమ్మని పిలిచి నాకన్నముందు నీవెట్లు గుడిచితివి? ఈరీతి నన్నవమానిం

చుటకు నీవెట్లుసాహసించితివి? విష్ణుభక్తి పరాయణుండ వనియుఁ ధర్మశీలుఁడవనియు నుతికెక్కిన నీవీయధర్మమున కెట్లుబాల్పడితివి? మదీయప్రభావంబు నేనియు గమనింప వలదా? ఇట్టి దురాచారుని నిన్ను శిక్షింపక విడచి పుచ్చుదునా? ఈదుర్వాసుఁడు నీకన్నులకు శక్తిహీనునివోలెఁ గన్పడెనా? నేను గోపించిన నన్నెదుర్కొనఁ జాలినవారలెవ్వరు? అని—

చ॥ పెట పెటఁ బండ్లుగీటుచును బ్రకరుఁడై కనుగ్రేవ నిప్పుకల్
పొట పొటరాల గండములు పొంగమునీందుఁడు హుంకరించుచున్ జట మొదలంటఁగాఁ బెఱికి చక్కన దానవ కృత్యనాయుధోత్కటవనమాల హస్తయునుగా నొనరించి కవించె రాజుపై.

అవ్విధంబున భీకరాట్టహాస మొనర్చుచుఁ దనపైకి వచ్చుచున్న యాకృత్యఁగాంచి యంబరీషుఁడు భయంపడి వేఱొండు శరణ్యంబు లేకుండుటవలన నిజస్వామియగు శ్రీమన్నారాయణునిఁ బ్రార్థింప నాపురాణపురుషుఁ డాతని మొర నాలకించి దుర్వాసుని దురహంకార భావమునకుఁ గోపంబుదీపింపఁ దక్షణమున నెందును నెదురులేనట్టి తన చక్రాయుధంబును భక్తరక్షణార్థమై పనుప నదియు ననలంబు గురిపించుచుఁ బరతెంచి యంబరీషునిపైఁ గవియుచున్న కృత్యను

మునుమున్నె భస్మంబుగావించి యంతః దనిపోవక భర్తన కెగ్గాచరించిన యాదుర్వాసుని వెంబడించె. అప్పుడాతండు హాహారవ మొనర్చుచుఁ జక్రంబు నెదుర్కొనఁజాలక పరుగిడఁజొచ్చె. కాని యాచక్రం బాతనిని విడువక యాతఁడెం దేగిన నందేగుచు జలంబుసొచ్చినఁ దానును జలంబుసొచ్చుచు నిట్లనేక విధంబుల నాతనిని వెంబడించుట వలన నాతండు చక్రంబు బారి దప్పించుకొను తెఱంగుఁగానక తుదకు బ్రహ్మలోకంబున కరిగి 'హే! వాణీధవా! నన్నీ చక్రంబు బారి నుండి రక్షింపుము' అని యప్పితామహుని శరణంబు వేఁడెను. కాని యాతండు మునీంద్రుఁ గనుంగొని 'ఓయతివర్యా! హరిచక్రంబు మరల్పఁగలశక్తి నాకడ లేదు. సకల భూతములును, నఖిల దేవతలును, నేనును, నాతని యాజ్ఞాబద్ధులమై యుందుము. కావునఁ జక్రంబుమరల్ప నేనోప' ననిన దుర్వాసుండు నిరాశనొంది యచ్చటినుండి కైలాసంబునకరిగి శర్వునాలోకించి చక్రంబు బారినుండి రక్షింపవేయని ప్రార్థించిన నప్పరమేశ్వరుఁడు 'ఓయీ! ఇది నాచేతనగు పనికాదు. నారద సనత్కుమార ధర్మకపిల మరీచ్యాదులును, యక్ష రాక్షస గంధర్వ కింపురుషాదులును, బ్రహ్మయు, నేనును నాతని మాయలోఁ జిక్కియున్నవారము. అట్టి మేము నిన్ను గావఁగలమా? హరియొక్కఁడే నిన్నుఁగావ సమర్థుఁడు.

ఆమహాత్మునే శరణంబు వేడుము' అని పలికిన నచ్చోటువాసి వైకుంఠంబున కరిగె.

అచ్చోట శ్రీమన్నారాయణుఁడు తన్నుఁ గూర్చి ప్రార్థించుచు వచ్చిన యాదుర్వాసుఁ గనుంగొని ఓయీ! తాపసా! నీయహంకారంబువలననే నీకిట్టి కష్టములు సంప్రాప్తములైనవి. బ్రాహ్మణులకుఁ దపము విద్యయు నీరెండును ముక్తినొందుటకుఁ గారణములైయున్నవి, కాని దుర్వినీతి వగు నీయందలి కోపమును గూర్చుచున్నవి తపోబలంబునలనఁ గన్నుగానక నాభక్తున కెగ్గాచరింప సమకట్టితివి. నేనెల్లప్పుడు గోవువెంటఁ దగులు కోడెభంగి నాభక్తులవెంట నంటి యుండుదు. నా తేజమువారియందు లీనమైయుండును. అన్నిఁటిని వదలి నేనెక్కడని నమ్మి నన్నుగొల్చువారిని నేనెన్నఁడును విడువను. నన్ను నాభక్తులు మాత్రమే యెఱుఁగఁ జాలినవారు. అట్టిభక్తులకుఁ గష్టము గలుగుచుండ నేను సహించియుండనోపను, భక్తరక్షణార్థమై పనుపఁబడిన యీ చక్రంబును మరల్ప నావలనఁగాదు. నీవెవని నత్యల్పుఁడని సమయింపఁ దలఁచితివో యాతఁడొక్కఁడే చక్రంబు నివారించి నిన్ను రక్షింపఁ గలవాఁడు కావున నాతనినే శరణు వేడుము' అని పలికిన విని దుర్వాసుండు బుద్ధితెచ్చుకొని యెంతవారికేనియు నహంకారము తగదని భావించుచుఁ

దా నెవనిఁ దృణీకరించెనో యట్టి యంబరీషునికడకరిగి, రక్షిం పుము, రక్షింపుమని యాతనిపదములపై బ్రాలెను.

అప్పు డన్ను శరణంబు వేడిన యామునివల్లభుని సకరుణం బుగా లేవనెత్తి 'స్వామీ! అపరాధమును క్షమింపుడు. నన్నింతగాఁ బ్రార్థింపవలయునా? ఇదియంతయు భగవ చ్చిత్రము. మనమందర మాతని మాయాప్రపంచంబునఁ జిక్కియున్నవారము. నేనా మిమ్ము రక్షించువాఁడను. అయి నను యత్నించెదఁగాక' యని చక్రంబు నుద్దేశించి.—

ఓ చక్రరాజమా !

సీ. నీవ పావకుఁడవు ♦ నీవసూర్యుండవు
నీవచంద్రుండవు ♦ నీవజలము
నీవ నేలయు నింగి ♦ నీవసమీరంబు
నీవ భూతేంద్రియ ♦ నికరములును
నీవ బ్రహ్మంబును ♦ నీవ సత్యంబును
నీవ యజ్ఞంబును ♦ నీవ ఫలము
నీవ లోకేశులు ♦ నీవ సర్వాత్మవు
నీవకాలంబును ♦ నీవజగము

గీ॥ నీవ బహుయజ్ఞభోజివి ♦ నీవ నిత్య
మూలతేజంబు నీకు నే ♦ మ్రొక్కువాఁడ
నీరజాక్షుండు చాల మ ♦ న్నించునట్టి
శస్త్రముఖ్యమ కావవే ♦ చాలు మునిని.

అని యనేక విధంబుల స్తుతియించి యంతఁ దని
వోవక యమ్మహీకాంతుఁడు—

ఆ॥ వె॥ విహిత ధర్మమందు ♦ విహరింతు నేనియు
నిష్టమైన ధర్మ ♦ మిత్తు నేని
ధరణి సురుఁడు మాకు ♦ దైవతంబగు నేని
విప్రునకు శుభంబు ♦ వెలయుఁగాక.

అని పలికినఁ జక్రంబు శాంతినొంది మునిని వీడి
నిజలోకంబున కరిగె. అప్పుడు దుర్వాసుఁడు తన యహం
కారంబు వలనఁ గలిగిన కష్టంబులకు బుద్ధి తెచ్చుకొని యంబ
రీషునిఁ గీర్తించుచు నెట్టివానికి నహంకారము తగదని యెంచి
తన నివాసంబున కరిగె.

కావున బాలకులారా! మానవున కెట్టివేళను నహం
కారము పనికిరాదు. దానివలనఁ గీడుకలుగును.



# 3 పరోపకారము.

బాలకులారా! పరోపకారమనునది మానవ ధర్మం బులలో నుత్తమమైనది. మానవ జన్మంబెత్తినవారలకందఱకును నిది విధియైయున్నది. పరోపకారమనుమాట సకల భూతంబులయందును సమముగాఁ బ్రవర్తించుచున్నది. పరోపకారమునకై వృక్షములు ఫలించుచున్నవి. పరోపకారమునకై గోవులుపాలిచ్చుచున్నవి. పరోపకారమునకై నదులు ప్రవహించుచున్నవి. పరోపకారమునకై మేఘములువర్షించుచున్నవి. వేయేల? ఈసకల చరాచరంబులన్నియు మానవోపకారమునకై పాటుపడుచున్నవి. అట్టియెడ మానవునకియ్యది విధ్యుక్త ధర్మమగునా కాదా యని విచారింపవలయునా? పరోపకార మెన్నియో విధములఁ బరగుచుండును. మానవుఁడెల్లప్పుడు—

'తన్ను మాలినధర్మంబు ♦ ధరణిగలదె?'

అను వచనప్రకారము తన మేలునకై యత్నించుచుండుట లెక్కలోనికి రాదు. అయ్యది కేవలము స్వార్థమనియెన్నంబడును. స్వార్థపరాయణత్వంబువలన మానవుఁడు సహజ ధర్మము నతిక్రమించినవాఁడగుటయే గాక యెల్లప్పుడాశాపాశములం జిక్కినవాఁడగును. అట్టివాడెందును గీర్తిసీయుఁడుగానేరఁడు. పరోపకారమొనర్చునప్పుడు ప్రత్యుపకారము

నాశింపఁ గూడదు. తన్నుఁ గూర్చియేనియు విచారించు కొనఁగూడదు.

"తనకార్యంబు పరిత్యజించియుఁ
బరార్థ ప్రాపకుల్ సజ్జనుల్."

అను నానుడి కైవడి సజ్జనులగు వారలు పరోపకార మొనర్చుచున్నప్పుడు తమ కార్యము నేనియుఁ బరిత్యజింతురు. ఒకవేళ నీధర్మాచరణమున తన ప్రాణముపోవు స్థితియు సంభవించుఁగాక! అయినను మానవుఁ డప్పట్టున వెను దీయక నిలచి యుండవలయును. అట్టు నిలచియున్న వాని చరిత్రమే యాచంద్ర తారార్కస్థాయిగా నీవిశ్వంబునఁ గీర్తింపఁ బడుచుండును. అట్టివాఁడే సజ్జనుండని యెన్నం బడును. ఇంకను బరోపకారమునఁ గొన్ని మార్గములు సూపఁబడి యున్నను నవి యన్నియుఁ బైదానికి సరిగా నేరవు. తనకష్టమును గణింపక పరోపకార మొనర్చువాఁడే నిక్కమైన మానవుఁడు. వీని కనుగుణ్యంబుగ నొక్కగాథ గలదు. తెల్పెదవినుండు.

## — రంతి దేవుఁడు. —

పూర్వము పురూరవవంశ సంభూతుఁడగు నొక్క మహీకాంతుఁడు గలఁడు. సంకృతియను పేరునంబరగు నాతనికి గర్గుండును, రంతిదేవుండును, నను కుమారు లిద్దఱు

గలరు. వారియందు రంతిదేవుండు రాజ్యభోగంబులపై నాస వీడి పుట్టువునుండియు భక్తిమార్గంబునఁ జరించుచుఁ బరోప కార పరాయణుండై వర్తింపఁదొడంగె. ఆతని చరిత్రము వర్ణనాతీతము. ఆతనిచూపు లెల్లప్పుడు నితరుల కష్ట పరంప రలఁ గాంచుటకే యుత్సాహ పడుచుండును. కాయ మెల్ల ప్పుడుఁ బరబాధా నివృత్తికై పాటుపడు చుండును. కరము లెల్లప్పుడును బరోపకార మొనర్చుటకే యత్నించుచుండును. భావ మెల్లప్పుడు కృపారస భరితమై నిమ్మకు నీరెత్తినట్లుం డును. ఇట్టి సుగుణంబులచే విరాజిల్లు రంతిదేవుండు దన సంచితార్థంబుల నన్నింటిని బరోపకారార్థమై వినియోగించి నిరుపేదయై వేళకు సరిగా నన్నపానీయంబుల కెడమయ్యును ధైర్యంబు వీడక సకుటుంబముగా నేదియో యొకవిధమున జీవయాత్ర గడపఁదొడంగె. తానంత నిరుపేద తనమున నున్నవాఁడని యీషణ్మాత్రమేనియు బరోపకారబుద్ధి వీడిన వాఁడుగాఁడు. అట్టి స్థితియందేనియుఁ జేతనగునంత వఱకుఁ బరోపకార మొనర్చునే యుండెను. తన కున్న దానియందు లేదనకుండ నప్పుడేనియు నొరుల కొసంగుచునే యుండెను. అట్టి యాతని ప్రవర్తనమునకుఁ గుటుంబము వారుఁగూడ ననుకూలంబుగ నుండుటఁజేసి యాతనికే మాత్రము మనః కష్టము గలిగినది కాదు.

కుటుంబభార మెక్కుడగుటవలనఁ దదర్థిక్షణ మాత్ర నికిఁ జాల కష్టతరముగా నుండెను. కుటుంబమున కంతటికిని జాలినంత యాహారము లభింప కుండెను. ఒకపూట దొరికిన రెండవపూట లేకుండెను. తుదకు రంతిదేవుఁడు సకుటుంబముగా మూడహోరాత్రంబు లన్నమే యెఱుంగనివాఁడయ్యెను. సతీసుతులు మిక్కుటంబగు క్షుద్బాధచేఁ బీడింపబడి మూర్ఛావస్థయందు మునింగి యుండుటవలనఁ గనులారఁ జూడనేరక యాతండు నాలవనాడశనార్థమై యెందేనియునరిగి కొండొక తడవునకుఁ గొలది యాహారమును మాత్రమే సేకరించికొని వచ్చి సమభాగంబులుగానొనర్చి మునుమున్న సతీసుతులకుఁ గుడువఁబెట్టి కొంతవఱకు వారలక్షుద్బాధ నపనయించెను. తానును మూడుదినంబు లుపవసించియున్న వాఁడగుటవలనఁ దన భాగమునకు వచ్చిన యన్నంబును గుడువ సంసిద్ధుఁడై యుండెను. అట్టియెడ నొక్క భూసురుండచ్చోటున కరుగుదెంచి 'ఓయీ మనుజవల్లభా! గత దినంబు నుండియు నన్నమన నెట్టిదో యెఱుంగక మిగుల నాకలిఁ గొని యుంటిని. నడచుటకుఁ గాళ్లు రాకున్నవి. క్షుద్బాధ వలనఁ బ్రాణము లన్నుబట్టి యున్నవి. ఇంత యాహారంబు నొసంగి మత్ప్రాణంబుల రక్షింపుము.' అని ప్రార్థింప రంతిదేవుఁడు మారుపలుకక తన యన్నంబులోని సగంబు నెత్తి

యిచ్చిన నావిప్రుండు దాతన్ తృప్తిపడి యాతనిదీవించి యొందే నియునరిగె.

అట్లు బ్రాహ్మణుఁడు సనినపిదప నారాజచంద్రుఁడు తానిట్టి యనన్యయందేనియు నతిథిసత్కార మొనర్చినవాఁడయ్యెఁగదా యని లోన గర్వంబునొంది భూసురునకీయఁగా మిగిలిన యన్నంబును గుడువ సంసిద్ధుఁడయ్యెను. అట్టియెడ నచ్చోటున నొక్కశూద్రుం డరుదెంచి "అయ్యా! రాజోత్తమా! రెండుదినంబులనుండి యన్నంబు నెఱుంగక మిక్కిలి యాకలిఁ గొనియుంటిమి. ఇంతవఱ కెచ్చోటను నాకన్నంబు లభింపదయ్యెను. ప్రాణము లెగిరిపోవు చున్నవి. నాకింత యన్నంబుఁ బెట్టి రక్షింపుము' అని దీనాతి దీనంబుగఁ బ్రార్థింప రంతిదేవుండు కృపార్ద్ర హృదయుండును, బరోపకారాయణుండును, నగుటవలన నాతనికి లేదనఁజాలక యప్పటికిఁ దనకున్న యన్నంబులో సగంబునెత్తి యాతని కొసంగెను. ఆశూద్రుండును దానతృప్తినొంది యామనుజవల్లభునిఁ గొనియాడుచుఁ దనదారిని దానరిగెను.

అట్లు శూద్రుండు సనినయనంతరము రంతిదేవుఁడు మిగిలిన యన్నంబును గుడువ సంకల్పించుకొని యుండెను. అట్టియెడఁ గుక్కగమితో నొక్క వేటకాఁ డచ్చోటి కరుదెంచి యాతనిఁగాంచి 'ఓ మహారాజా! వేటతమకంబున

మార్గంబు దప్పి నివాసంబున కరుగు తెరువుఁగానక యర ణ్యంబున నన్నపానీయంబు లెఱుంగక మూఁడు దినంబుల నుండియుఁ దిరిగిన వాఁడను దిరిగినట్లేయుంటిని. ఇంత వఱ కును సరియగు మార్గంబును గురుతింపఁ జాలకుంటిని. ఆకలి మిక్కుటముగానున్నది. ఇంక మసలినఁ బ్రాణంబు లెగిరి పోవుట నిశ్చయము. ముందు నాకింత యన్నంబు నొసంగి రక్షింపుము' అని గుండె నీరగునట్లు ప్రార్థింప రంతిదేవుఁడు వేటకాని దీనాలాపంబులకు సైరింపనోపక యాక్షణంబున నే తనకు మిగిలియున్న యన్నంబునంతయు నాతని కొసంగెను. ఆవేటకాఁడు దానసంతుష్టిఁగొంచ యాతనిఁ దలంచుకొనుచు మార్గంబునఁబట్టి యరిగెను.

అట్లా వేటకాడరిగిన యనంతరము తన కన్నంబు లేక పోయెఁగదా యని యాతం డేమాత్రము విచారింపక పోవు టయేగాక నాఁడతిథి సత్కారము చక్కఁగా జరిగినదని సంతో షించుచుఁ దన కడనున్న జలమునేనియుఁ గ్రోలి కొంతవఱ కేని క్షుద్బాధనపనయించుకొనవలెనని జలకలశము నెత్తి త్రాగుట కుద్యుక్తుండైయుండు నెడ నచ్చోటి కొక్క చం డాలుఁ డరుదెంచి కరంబులుమోడ్చి 'స్వామీ! నేను కడజాతివాఁడను. నిరుపేదనగుటఁజేసి కష్టైలం గొట్టుకొని జీవించుచుంటిని. ఎప్పటియట్లు నేడు నాకర్తవ్యమున మునింగి

యుండఁ జాలఁ బ్రొద్దయ్యెను. ఎండవేడిమివలనను, సలుపు పనివలనను, నాలుక పిగుచఁగట్టెను. పరిసరంబుల నెచ్చోటను జలాశయంబు గానఁబడదు. దాహంబు మిక్కుటంబుగా నున్నయది. నాకుఁ గొంచెము నీరొసంగి రక్షింపుడు' అని ప్రార్థింప రంతిదేవుఁడు వానిఁగాంచి—

ఉ॥ అన్నము లేదు కొన్ని మధురాంబువులున్నవి త్రావుమన్న ర
మ్మన్న! శరీరధారులకు నాపదవచ్చిన వారి యాపదల్
ద్రన్నన మాన్పి వారికి సుఖంబులు సేయుటకన్న నొందు మే
లున్నదె? నాకు దిక్కు పురుషోత్తముఁడొక్కఁడె సుమ్ము; పుల్కసా!

అని తెలియఁ బలికి యాతఁ డనుమానింపక తాను గోరిలనున్న జలంబునంతయు నాతని కొసంగి ప్రాణంబుల రక్షింప నాతండును రంతిదేవునిఁ గొనియాడుచు యథేచ్ఛం జనియె. అప్పుడా రాజచంద్రుని పరోపకారబుద్ధికి బ్రహ్మాది దేవతలు మిక్కిలి సంతోషించి నిజాకారంబులతో నాతనికి దర్శనమిచ్చి "ఓరాజా! నీబుద్ధికి మెచ్చి మేలు సేయఁదలంచితిమి. వరంబులు గోపకొనుము" అని పలికిన వారలకు నమస్కరించి తన కేమియు వరంబులు వలదని తెలుప వారలు తమకు దామే యనేకవరంబు లొసంగి యదృశ్యులైరి. నాటనుండి రంతిదేవుండు సుఖంబుగఁ గాలంబు గడుపఁ దొడంగె.

కావున బాలకులారా! మానవుఁడు పరోపకార మొనర్చునప్పుడు తన్నుఁగూర్చి విచారింపఁగూడదు.



## ౪ తనకు మించినపనికిఁ బోరాదు.

బాలకులారా! మానవుఁ డెన్నండును దనకు మించిన పనికిఁ బోరాదు. ఇట్లు పోకుండుటకు మనుజుఁడు ముందు తన్ను దా నెఱుంగవలయును. ఏకార్యమును జేయఁగడంగి నను దన యంతరము నెఱింగి యద్దానికిఁ గడంగవలయు. ఒక వేళ మానవుఁ డితరులవలని ప్రోత్సాహమున నేమి, తనకు లోనున్న గర్వంబువలన నేమి, తనకు మించిన పనికిఁ బూని కొనినచో నద్దానిఁ దాను నెరవేర్ప లేక పోవుటయేగాక, నిజ ప్రాణరక్షణార్థమై మానమును జంపుకొని తన విరోధినే ప్రార్థింప వలసివచ్చును. తనశక్తి నెఱుంగుటయన సామాన్య మైనది కాదు. శరీరమునఁ జాలినంత బలముండ వచ్చును. కార్యగతుల ననేకంబు నెఱింగియుండవచ్చును. అంతమాత్ర మున నే తనకు నెవ్వరు సాటిరాఁజాలరను గర్వంబునఁ దన్ను మించినవారిపైఁ గాలుదువ్వరాదు. గార్ధభ మెంత బలము గల దియైనను, నాకారమున నన్నివిధుల నశ్వమునుబోలియున్నను

నంతమాత్రముననే యది గుఱ్ఱము కానేరదు. ఒకవేళ నది గుఱ్ఱముతోఁ డీకొనినను దానికి గర్వభంగమగుటయే కాని గుఱ్ఱమునుమించి పోఁజాలదు. ఈవృత్తాంతమును దెల్పునొక్క కథగలదు. తెల్పెదవినుండు.

## — హంసము వాయసము —

పూర్వకాలమున ధర్మపురమను నొక పట్టణంబుగలదు. అందు సత్ప్రవర్తనుఁడును, నిజ కులాచారక్రమాభిరతుఁడును నగు నొక వైశ్యుఁడుగలఁడు. అతని సత్ప్రవర్తనమునకుఁ దగినట్లు పుత్రసంతతియు, సంతతికిఁ దగినట్లు సంపదయునుండుట వలన నాతని కన్నివిధముల జీవయాత్ర మహానందకరముగా నుండెను. ఇట్లుండ నొకనాఁడా వైశ్యుని కుమారులకుఁ గర్మవశమున నొక కాకిపిల్ల చేఁజిక్కెను. వారును దాని యందు మక్కువగలిగి తగినట్లాహారము నొసంగుచుఁ బెంప సాగిరి. అదియును నుచ్ఛిష్టాన్నమును భుజించుచు వారి వెనువెంటఁ దిరుగుచు నాకారమునఁ దగిన యాహారము లభించుచుండుటవలనఁ దన జాతివాయసములకు మిన్నగా నుండెను. నానాటికి శరీరదార్ఢ్యము వృద్ధియగుచుండుటవలన నక్కాకము క్రొవ్వుబట్టి యెట్టి పక్షులును దన్నుఁబోల వని యెడు దుర్మానమునఁ దృణీకరించి పెక్కు భంగులవిహరింప

సాగెను. దినములు గడచిన కొలంది దాని కన్నరసము చక్కఁగా దలకెక్కెను. తన్మూలమున దానికిఁ దన యంతరమే తెలియకుండెను. దానికిఁ దగినట్లా వైశ్యుని కుమారులు తమ వాయసముతో నెచ్చియు సరిగావని యెంచుచుండిరి.

ఇట్లుండ నొకనాఁడు వారందఱు తమ పురమున కనతి దూరమున నున్న సముద్ర తీరమునకు విహారార్థమై యరిగిరి. కాకియు వారిని వెన్నంటియే యుండెను. అచ్చోట గొన్ని హంసంబులు వారలకుఁ గనఁబడెను. వారందఱా మరాళములను గాకంబునకుఁ జూపి—

కం॥ పులుఁగులలో నీవెక్కుడు
విలసద్గతి నంచ లిట్లు ♦ వినువీధిఁ గరం
బెలమిం జనియెడు వీనిం
గలసి పఱచి గెలువవలదె ♦ గతుల బహుళతరా

అని వాని వాని తారతమ్య జ్ఞానహీనులగువారు పలికిన, నుచ్ఛిష్ట దర్పితంబగు గాకంబు నిజముగఁ దాను హంసంబులకన్న మిన్నయని నెమ్మనంబునఁ దలంచి సగర్వంబుగఁ దలయెత్తి వానియందుఁ దనకుఁ దగినహంసం బేదియో యని వరుసఁగాఁ దిలకించి మేటియగు దానిఁజేరి తన్నుఁ గెలువరమ్మని పిలచిన మరాళంబులన్నియు దానిమౌర్ఖ్యంబు

నకునవ్వి యా వాయసముతో 'ఓవాయసమా! పక్షిజాతియ మ మాకు జవసత్వములు మెండు. ఏపక్షియుఁ బరుగెత్తుటయందు మమ్ము మించి పోఁజాలదు. ఎచ్చోటను గాలు మోపక మే మెంత దూరమైనను బోఁగలము. ఎడతెగని ప్రయాణమున సముద్రంబుల నన్నిఁటిఁ గూడఁ జుట్టిరాఁగలము. అట్టి మాతో నా నీవు పందెము వేచుట? అందు మాయందు మేటి యగు దానిఁబిలచితివి. ఎంగిళ్లుదిని నీకొలఁది నీవెఱుగక మిట్టిపడుచుంటివి. ఇంతకు మునువెన్నఁడును హంసములఁ గెలువఁజాలిన కాకంబులను గాంచి యెఱుంగము. నీప్రయ త్నమును మానుము' అని యెన్ని యోవిధముల నవి దానికి బోధించెను.

అప్పుడవ్వాయస మాయంచలఁగాంచి 'ఓహంసలారా! నన్నుఁ గెలువ శక్యముగాదని మీరలీ రీతినిఁ బల్కుచుంటిరి. పఱచుటయందు మీకొక్కగతియే తెలియును. కాని నా కన్ననో నూటొక్కగతులు దెలియును. వక్రయానము, వలయక్రమము, మున్నగు గతులయందు మిమ్ముఁ గెలువ నేర్తును. మీమేటియంచ నిపుడే పంపుడు. మీజాతికిఁ దల వంపు లగునటు దాని నిప్పుడే యోడించెద' నని పలుక నచ్చోటనున్న వాయసంబు లన్నియు శతప్రకార గతియగు దోడి కాకమ్ముతో నాయంచ గెలువఁజాలదని మరాళంబుల

నన్నింటిని గెలిసేయునెడ మున్నాహూతంబైన హంసంబు వాని యవివేకమునకు నొచ్చుకొని తగినట్లు బుద్ధిసెప్ప వలయునని మున్నిటిపై నక్కాకముతోఁ బరుగిడసాగెను.

అప్పుడు వాయసంబులన్నియుఁ బందెమేమగునాయని సముద్రమువంకఁ జూచుచుండ మరాళంబులన్నియు జయంబు తమదేయని నిర్విచారంబుననుండెను. అట్టియెడఁ దనతో నచ్చుచున్న రాయంచ మందగతిని జనుచుండుటఁగాంచి యవ్వాయసము తానిఁక హంసమును గెలుతునుగదాయను గర్వంబున నోడ లెఱుంగక—

ఆ. ఎలమిఁగడచిపోవుఁ ♦ బిలుచుఁ గ్రమ్మఱివచ్చి
ముక్కుముక్కుమీద ♦ మోపుఁజుట్టు
నేచి తిరుగు నీఁక ♦ లీకలతో రాయు
నోరయుఁజిత్రగతుల ♦ మఱియు నవ్వు.

ఇవ్విధంబునఁగాకం బనేకప్రకారంబులఁ బఱచుచుండఁ దోడి వాయసంబులన్నియుఁ గ్రొళ్ళిపడుచు నదె మరాళంబు పరాభవంబు నొందెడుఁ జూడుండని గోలసేయుచుండఁ దదీయకలకలంబాలకించి యాహంసంబు రెట్టించిన యుత్సాహంబున మిన్నుల రాయునట్లు పైకెగసి శరవేగంబున ముక్కునకు సూటిగాఁ బోవునెడ వాయసము, కాలు

మోపుట కెందును నాధారంబు లేకుండుటవలనఁ గొంత వడికి నలసి పరాళంబుతోఁ బరుగిడఁ జాలక క్షణక్షణము నకు నిజపక్షబలంబు సన్నగిలుచుండ నా కులాంతరంగంబున 'అయ్యో! నాకుఁగల శక్తి నెఱుంగక కుడిచి కూర్చొని యీహంసముతోఁ బందెమునకుఁ గడంగితిని. ఎందుఁ జూచినను గాలూనఁదావు కనుపింపకుండెను. ఇఁక హంస ముతోఁ బరుగిడు టెట్లు? తనకు మించిన పనికిఁబోయినచో ముప్పుకలుగకుండునే? ఇదియంతయు నాదుర్మానము వల ననేగదా చేకూరినది?' అని తనలోఁ దాను వితర్కించు కొనుచు నెట్టెటులోఁ గొంతవఱకుఁ బరుగిడి తుదకుఁ జేయు నది లేక పక్షంబులు బరువులగుటవలన నెగురలేక క్రమ క్రమముగాఁ గ్రిందికి దిగుచుఁ గడకు జలంబులఁబడియె. అప్పుడు తోడి వాయసంబులు దలలువంచుకొన నక్కా-కము నీటిపైఁ దేలియాడుచుఁ గాకా యని యఱచుచుఁ బ్రాణ రక్షణార్థమై పగతునిఁగాంచి—

కం॥ ఎంగిపులు గుడిచి క్రొవ్వునఁ
బొంగిన మెయితోడ గర్వ ♦ మునఁ దిరుగుచు నా
కుంగలచె? యెందునెదురు వి
హంగమ పతినైన గెలుతు ♦ నని మునుదలతుఁగా.

కం॥ నాకొలఁది యిప్పుడెఱిఁగితి
నీకరుణా లోకనంబు ♦ నిగిడించి శర

ణ్యా! కావు నన్ను మగుడం
గాకులలోఁ గలుపఁదగవు ♦ గాదే నీకుఁ.

అని దీనాతిదీనంబుగఁ బ్రార్థింప నాహంసము చావనున్న యవ్వాయసముపైఁ గృపఁగలిగి తన చరణంబుల నిఱికించుకొని బలస్ఫురణము మెఱయఁగ మోచికొనివచ్చి తోడికాకులతోఁ జేర్చి యెన్నండును మించినపనికిఁ బోకుమా యని యెన్నియోవిధంబులఁ దగినట్లు బుద్ధిసెప్పి యింతటితో దెలివిగలిగి వర్తింపుమాయని హెచ్చరించుచుఁ దన కులము వారితోఁగలసి వలయుచోటికిఁ జనియె. నాటినుండియు నా కాకి బుద్ధితెచ్చుకొని తగిన విధమున మెలఁగఁజొచ్చెను.

కావున బాలకులారా! మానవుఁడును దనకు మించిన పనికిఁ బోయినచో ముప్పునకుఁ బాత్రుఁడగును.



# ౫ నిదానము సర్వశ్రేయము

బాలకులారా! ఏకార్యము నేనియుఁ జక్కఁగా విచారించి చేయుటమంచిది. మానవుఁడెంతటి సన్మార్గప్రవర్తనుఁడైనను క్రోధంబువలన నొక్కొక్కప్పు డాతనికి యుక్తాయుక్తజ్ఞానమే లేకుండఁ బోవును. అట్టియెడ నిది చేయఁదగును నిది చేయరాదు అనియెడు కార్యవిచక్షణ మాతనికిఁ గలుగఁబోదు. తండ్రి యొక్కొక్కప్పుడు కోపోద్రేకంబువలన నొడలెఱుంగక చేయఁగాని పనులకుఁ గుమారుని నియోగింప వచ్చును. అట్టియెడఁ గుమారుండు నిర్మలపితృభక్తి తత్పరుండేయగుగాక! తండ్రిచెప్పిన దానియందుగల యుక్తాయుక్తంబుల నించుక విచారింప వలయును. అంత మాత్రముననే యాతని పితృభక్తికిఁ గళంకము రానేరదు. అట్లు విచారించుటవలనఁ దొలుతఁ గీడగునట్టిది తుదకు మేలుఁగా బరిణమించును. తన్నాజ్ఞాపించు నపుడు తండ్రి యెట్టి స్థితి యందుండెనో కుమారుడొకింత గమనింప వలయును. క్రోధభావమువనున్న నెంతటివాఁడేనియు దారిదప్పి పోవచ్చును. తన్మూలమున బుద్ధిమారవచ్చును. అట్టివాఁడు దుష్కార్యము నాచరింప నియోగించిన నట్టియెడ నిదానము వహించుటయే తగిన మార్గము. తన్మూలమునఁ గుపితుఁడు తనతప్పుల దెలిసికొని తన యాజ్ఞను మరల్పవచ్చును. అప్పుడు కీడు మేలగును. ఈ వృత్తాంతమును దెల్పు నొకకథ గలదు. తెల్పెద వినుండు.

## —♦ చిరకారి చరిత్ర ♦—

కం॥ త్వరితము సేయక కార్యము
చిరంతన విమర్శనముగఁ ♦ జేసి యొనర్పన్
ధరణీశ్వర! యోటువడదు
పురుషుఁడు సిద్ధియును వానిఁ ♦ బొందు దృఢముగన్

కం॥ తాలిమి లేని జనంబులు
మేలెఱుఁగక యట్టివాని ♦ మీఁదను జాడ్యం
బాలస్యంబిదియని దో
షాలోచన మాచరింతు ♦ రదిమతియగునే.

పూర్వము చిరకారియను నొక ముని కుమారుండు గలఁడు. అతఁడెట్టి కార్యమును సలుపయత్నించినను జిరకాల సువిచారితంబుగాఁజేసి యాచరించుచుండెడి వాఁడగుటవలన నాతఁడు చిరకారియను పేరునఁ బిలువఁ బడుచుండెను. ఆతఁడు మొదటి నుండియుఁ దల్లిదండ్రులయెడఁ గడుంగడు భక్తిగలవాఁడై యెల్లప్పుడు వారి యాజ్ఞల శిరసావహించుచు వర్తించుచుండెను. ఆతని గుణములకుఁ గార్యాచరణ మందాతనికిఁ గల నిదానమునకు నెల్లవారాశ్చర్యపడుచు నాతనిని వంశపావనుఁడని తలంచుచుండిరి. ఇవ్విధముగా దినములు గడచి పోవుచుండెను. ఒకనాఁ డకారణంబుగఁ జిరకారి

తండ్రి నిజసతీమణిపైఁ గోపించి యప్పుడ కుమారుని జేరం బిలిచి దురాచారిణియగు నాతని తల్లిని వధింపుమని కఠిన ముగా నాజ్ఞాపించి యెచ్చటికో వెడలిపోయెను.

అట్లతిదారుణంబుగాఁ బల్కిన జనకుని వాక్యములు సెవులకు ములుకులవలెఁ దోపనమ్ముని కుమారుండు భయ కంపితాంగుఁడగుచు దైవమా యిదియేమని కొంతవడి దీర్ఘ ముగా నాలోచించి తుదకుఁ జేయునదిలేక తండ్రి యాజ్ఞను బాలించుటకై యాయుధమును జేఁబూని నిజజనని కడ కరి గెను. కాని కన్నతల్లినిఁ గాంచినంతనే యాతని హృద యము నీరైపోయెను. అప్రయత్నముగఁ జేతిలోని యా యుధము నేలఁబడిపోయెను. కన్ను లశ్రుపూరితములయ్యెను. కటకటా! కన్నతల్లిని జంపుట యన సామాన్యమా? అట్లు తన్నుఁగాంచి విలపించుచున్న కుమారునిఁ గని యమ్ముని పత్ని "నాయనా! నీకీ విచారమేల? నీ తండ్రి చెప్పిన చొప్పున వర్తించి పితృభక్తి పరాయణుఁడను పేరు సంపా దింపుము. నీ తండ్రియాజ్ఞ మన యిర్వురకును జవదాటఁ గూడనిది. కావునఁ దండ్రీ ధైర్యమును వహించి నన్ను వధింపుము' అని యాపరమసాధ్వీమణీ కుమారునితోఁ బలుక నాతఁడు పెద్దపెట్టున నేడ్చుచు నాదుష్కార్యమును సల్పు టకుఁ జేతులాడక తనలోఁ దానిట్లు విచారింపసాగెను.

'కటకటా! జనకునియాజ్ఞను జవదాటఁ గూడదు. అట్లని కన్నతల్లిని జేతులారఁ జంపుటయుఁ గూడదు. ఒకవేళ దండ్రిమాటను జవదాటుదునేని దానివలనఁ గల్మషంబావ వుట నిక్కము. కల్మషం బొదవునని భయంపడితినేని మాతృవధోద్యోగంబువలన ఘోరనరకప్రాప్తి సేకూరుట ముమ్మాటికి నిక్కము. మాతృరక్షణమే కర్తవ్యమని యఖిలశాస్త్రములు నుడువుచున్నవి. అయ్యో! పుత్రునిభావ మస్వాతంత్ర్యమునకు నెలవుగదా? జననీవధంబువలన ఘోరనరకప్రాప్తి యగునని యూరకుంటినేని జనకాజ్ఞమీరిన నాయట్టివానికి రౌరవాది నరకప్రాప్తి చేకూరకుండునా? కటకటా! ఇరువురకును నేను సమానమగు హక్కుగలవాఁడను. అట్టియెడ నేనెవ్వరిని విడువఁగలను? జనకుని పంపుసేయు కుమారున కఖిలపాపంబులును దొలంగునని ధర్మజ్ఞులు చెప్పుచుందురు. అదియును నిజమేగదా? కుమారునకు జనకుఁడే దైవము. ఆతనివలననే కుమారునకుఁ దపము, ధర్మము, విద్యయు, మున్నగు నవియన్నియు లభించుచున్నవి. ఆతనివలననే కుమారునకు సమస్తవిషయములును దెలియుచున్నవి. అట్టి జనకుని మనస్సునకుఁ బ్రియంబగు పనిసేయునెడల నఖిలదేవతలును సంతసింతురు. అట్టికుమారుఁడు కేవలము వంశపావనుఁ డగుచున్నాఁడు. అయ్యో! నేనెంత మందమతిని. తల్లిమాత్రము సామాన్యమైనదా ? నవమాస

'ములు గర్భమునఁ దాల్చి పడరాని యిడుములకుఁ బాల్పడుచు, బిడ్డకేమి జబ్బుకలుగునో యని తాను దినక నిజసౌఖ్యంబును విడనాడి పుత్రుని కొఱకుఁ గష్టపడునది తల్లియేకదా ? తండ్రియగువాఁడు వచ్చిచూచి పోవువాఁడేగాని కష్టములకు లోనగునది తల్లియేకదా ? కుమారుఁడు బాలుఁడైనను, ప్రౌఢుఁడైనను, వృద్ధుఁడైనను, నాతనియెడఁ దల్లిప్రేమ యొకే విధముగా నుండును. జగంబున మానవునకుఁ దల్లి కన్న వలయు పదార్థమేమి గలదు ? ఒక్క మానవులకేగాక క్షుద్రజంతువులకు నేనియుఁ దల్లియే ప్రధానపాత్రమగు చున్నది. మాతృవిహీనుండగు మానవుండన్నిఁట నసమ ర్థుఁడగును. అతఁడు నిరంతరదుఃఖియగు. అట్టివానికీజగం బంతయు నొక శూన్యగృహంబువలెఁ గన్పడు చుండును. ఇది యంతయు నిక్కము. అయ్యో ! ఇట్టి తల్లినేగదా నేను జేతులారఁ జంపవలసినది ?

కం॥ కలవాఁడు లేనివాఁడు స
బలుఁ డబలుఁడు మూఢబుద్ధి ♦ ప్రౌఢుం డనఁగా
వలదెవ్వరికైన జనని
కలిమియ యత్యంతసౌఖ్య ♦ కరమై యుండున్.

అని పెద్దలు సెప్పుదురు. ఇట్టితల్లిఁ జంపుటయనఁ గేవలము పాప పయోరాశియందుఁ గూలుటయేగదా? అయ్యో! ఎంత యత్నించినను మనస్సునకుఁ దెంపుకలుగుట

లేదు. చేతులాడుటలేదు. హా! దైవమా! ఏమి చేయుదును. అని యమ్మునిని కుమారుం డేమిచేయుటకును నిశ్చయించు కొనఁజాలక పలువిధముల విచారించుచుండెను.

ఇచ్చటి వృత్తాంతమిట్లుండ నచ్చోట నాతని జనకుఁడు శాంతించినవాఁడై యప్పుడు నిజసతీమణినిఁజంపఁ గుమారుని నేల నియోగించితినా యని పశ్చాత్తాపంబువడుచుఁ గ్రోధం బువలన నింతయయ్యెఁగదా యని తన్నుదాను నిందించు కొనుచు అయ్యో! ఇంక నాకట్టిసతీమణి లభించునా యని విలపించుచుఁ గుమారా! నాయాజ్ఞనువిని నీవెంత దుఃఖించి తివోగదా యని కుమారునిఁగూర్చి వాపోవుచు నతిరయం బునఁ బర్ణశాల కరుదెంచి యచ్చోట సతీసుతులఁ గానక యందందు నెమకుచు 'నాకుమారుఁ డెద్దానినేనియుఁ జిర కాలము విచారించి మఱి చేయుచుండును. అట్టివాఁడిప్పట్టున మాత్రము తొందరపడునా' యని తనకుఁదాను సమాధా నము సెప్పికొనుచుఁ దుదకు సతీసుతులఁ గనుంగొని పట్ట రాని సంతసంబునఁ బుత్రునుద్దేశించి—

ఆ. నాకు నాతపంబు ♦ నకు నిందరాకుండ
దురిత భయము నిన్నుఁ ♦ బొరయకుండ
నెమ్మిఁ జేసి తన్న ♦ నీచిరకారిత
సకలభూతములును ♦ సంస్తుతింప.

అని పలికి చేరందీసినఁ జిరకారియు వధసాధనంబు డిగ్గవిడచి తల్లియుఁ దానును నాతని చరణంబులపై వ్రాలి రక్షింపవేయని ప్రార్థించిన నమ్మునీశ్వరుండును శోక బాష్పంబు లానందాశ్రువులుగామార నయ్యిరువురను జేరందీసి నిజసతీ మణి ననేకవిధంబుల నూరడించి కుమారు ననేకవిధముల దీవించి 'నాయనా! నీచిరకాల విచారము వలననే మన వంశము రక్షింపఁ బడినది' అని యాతనిచేతకు సంతసించి యదిమొదలు దారాపుత్ర సహితంబుగా నమ్మునీశ్వరుండు పెద్దకాలంబు సుఖజీవన మొనర్చుచుండెను.

కావున బాలకులారా! మానవునకు నిదానమువలన సర్వశ్రేయములు సమకూరుట నిక్కువము.

# ౬ దూరాలోచనము.

బాలకులారా! ఎంతటివారును బనులయెడ దూర మాలోచింపవలయును. యుక్తాయుక్త విచారమొనర్పక యేపనికేనియుఁగడంగినచో దానివలన నాదియందో యంత మందో మానవునకుఁ గీడురాకమానదు. దూరాలోచనమను నది మానవునకుఁ బెన్నిధివంటిది. తల్లాభంబువలన మేలును దన్నాశంబువలనఁ గీడును గలుగుట నిక్కము. దూరాలోచనము మానవునియందు నశించుట కనేక కారణములున్నవి. మొదటిది కోపము. కోపమువలన మానవునియెడ నన్నియు నశించుననియే చెప్పవచ్చును. ఈ కోపను మానవునిచేత నెన్నియో చేయరాని కార్యంబులఁ జేయింపఁగలదు. ఇచ్చ వచ్చిన చొప్పున నాడింపఁగలదు.

కోపమునను ఘనత - కొంచెమైపోవును
గోపమునను గులము - గూలిపోవుఁ
గోపమడచెనేని - కోరికలీడేరు
విశ్వదాభిరామ - వినర వేమ!

ఇత్తెఱంగునఁ గ్రోధము మానవునిఁ గొయ్యబొమ్మ వలె నాడించును. ఇట్టి కుపితునియెడ దూరాలోచనము నశించిపోవును.

"తన కోపమె తనశత్రువు"

అని మెఱింగినచో మానవునకెట్టి మొగ్గును బ్రాప్తించదు ఇఁక రెండవది చెప్పుమాటలనాలకించుట. ఇదియునుదూరాలోచనము నశించుటకుఁ బ్రబలమైన కారణమే. ఇతరులు సెప్పిన మాటలనే పాటించి యాత్మబుద్ధిని విడనాడినచోఁ దన్మూలమున మానవునియందు దూరాలోచనము నశించును. మంచి స్నేహభావమున మెలంగు స్నేహితులకుఁ బలువురు పలుభంగుల వారిస్నేహమును జెరుపవలయునని యనేక విధముల నొకరిపై నొకరికి మనస్సు చెడునట్లు చెప్పవచ్చును. అప్పుడు దూరమాలోచింపక యితరులు చెప్పిన మాటలనే నమ్మియుండిన వారియెడఁగల స్నేహమంతరించి యంతకు మిక్కిలి విరోధభావ మేర్పడునుగదా? కావున నిందువల్లను దూరాలోచనము నశించును. ఇంకను ధనము వలనను, దరుణివలనను, మానవునియందు దూరాలోచనము నశించుచున్నది కాంతాకనకంబుల మూలంబున మానవున కొకొక్కప్పుడు ప్రాణాపాయమే సంభవించుచుండును. అట్టియెడ నాతనికి దూరాలోచనమే శరణ్యమగుచుండును. దూరము విచారించినఁ గలహము పుట్టనేరదు. ఇంకను సోదర పఠుటవలనను నియ్యది నశించుచున్నది. ఇట్లనేక విధముల మానవునియందు దూరాలోచనము నశించుటయు దన్మూలమునఁ గీడుపాప్తించుటయు జరుగుచుండును. దీని కుదాహరణముగా నొక్క కథ గలదు. తెల్పెద వినుండు.

## —। వ్యాఘ్రము, గోమాయువు ।—

పూర్వకాలమునఁ బురికయను నొక్క పట్టణంబు గలదు. అందుఁ బౌరికుఁ డనురాజు శత్రుభయంకరంబుగఁ బాలన మొనర్చు చుండెను. కాని కొంతకాలంబున కానృపతి కర్మవశంబునఁ గ్రూరుఁడై యనేక దుష్కార్యములొనర్చుచు నందరిచేతను దూషింపఁబడుచుఁ గాలంబాసన్నంబగుడు మరణంబు నొంది తానొనర్చిన దురితకార్యంబులవలనఁ దిరిగి గోమాయువై జన్మించెను. అట్లు నీచజన్మంబు నొంది యుఁ దొల్లి యాతఁడొనర్చిన కొలఁది పుణ్యంబువలనఁ బూర్వజన్మవృత్తాంతంబు నెఱింగినవాఁడై యీజన్మంబునం దేని సన్మార్గంబునఁ బ్రవర్తించి పుణ్యలోకప్రాప్తి నెందవల యునని యాతండు మాంసాశనంబువిడచి పర్ణభక్షణంబున జీవింపఁ దొడంగె. ఆనక్కయొక్క చేష్టితంబునకుఁ దోడి నక్కలన్నియు నిదియేమివ్రతమని గేలిసేయుచు వలసినంత మాంసమును మేము దెచ్చియిచ్చెదము. దాన సుఖింపు మని యెంత సెప్పినను దనబూర్వవృత్తాంతం బెఱింగిన యా నక్క దాని కొడంబడక తాను సంకల్పించుకొనిన వ్రతంబు నందే దృఢనిశ్చయంబు గలిగి వర్తించుచుండె.

ఇవ్విధంబునఁ గాలంబు గడచి పోవుచుండ నొక్కనాఁడక్కాననంబునఁ గల మృగంబులకెల్ల నధిపతియై

యున్న శార్దూలంబా నక్కవృత్తాంతంబు నామూలాగ్రం బుగా సహచరుల వలన విని మిక్కిలి యాశ్చర్యంబునొంది యిదియేమో పరికింతమని యానక్కయున్న యెడకుంజనియె అట్లు తన్నుఁ జేరవచ్చిన యామృగపతిని దగినరీతిని గౌర వించి యానక్క సముచిత సంభాషణంబుల నాదరింప నావ్యా ఘ్రంబు తొల్లింటికన్న నెక్కుడాశ్చర్యంబునొంది ‘ఓ జంబు కోత్తమా! నిన్నుఁ గాంచినప్పటి నుండియు నామనం బేలొకో నిర్విచారంబు నొందియున్నది. నీగుణంబులఁ గూర్చి నాసహ చరులు సెప్పఁగా వినియుంటిని. నీతోడి సఖ్యంబు దుర్ల భంబు. అయినను నీవు నాయందుఁ గరుణఁజూపి నాతోడ సఖ్యంబు నెరపి నాకు మంత్రివై హితాహితంబులఁ గూర్చి తెలుపుచుండుము.’ అని భక్తిపూర్వకంబుగాఁ బ్రార్థించిన నాగోమాయువా మృగపతిని నిరాకరింపక యాతనిఁగాంచి ‘ఓయీ! మృగరాజా! నీపల్కులు త్రోసివేయం దగినవికావు. అయినను రాజులతో సఖ్యము పాములతోఁ జెర్లాటవంటిది. నాపల్కులు వినుము. ఎప్పుడేనియు నాయందసూయా గ్రస్తులై నీభృత్యులెట్టి వాక్యములు నామీఁద సెప్పినను నీవు కోపపడకుండునట్లును, నేఁ జెప్పు హితాహితంబులఁ బాటిం చునట్లును వీరి ప్రోలఁ బ్రతిజ్ఞసేయుము. అట్లొనర్చినచో నీతోటి నెయ్యంబున కియ్యకొనియెద’నని పలుక శార్దూలం బందుకు సమ్మతించి యానక్కకోరినట్లు ప్రతిజ్ఞసేయ నాట

నుండి యానక్కయుఁ బులియు నత్యంత స్నేహభావంబున మెలంగఁదొడంగె.

అట్లామృగరాజు బద్ధస్నేహంబున నగ్గోమాయువుతో మెలంగుచుఁ దొంటియనుంగు చెలిమికాండ్రను మఱచి యుండ వారందరును గన్నుగుట్టినవారలై యెవ్విధంబున నేని శార్దూలజంబుకములకు విరోధముఁ బుట్టింపవలెనని సమకట్టి యొక్కనాఁడు నక్కయింటియందుఁ బులియారగించు మాంసంబు నంతయు నుంచిన నెప్పటి యట్లవ్యాఘ్రము మాంసాశనంబుకై యరుగఁ దన నివాసంబున నయ్యది లేకుండుట వలనఁ దన మాంసమును బ్రుచ్చిలించిన వారెవ్వరో కనుఁగొనవలెనని పరీక్షింపఁ దొడంగిన మూలభృత్యులందఱు గుమికూడి కపటోపాయంబునఁ దమ స్వామికానక్కయింటి యందు మాంసమున్న తెఱంగుఁ గనఁబఱచిన నప్పులియప్పుడ నేత్రంబు లెఱ్ఱఁజేసి యా నక్కయెడ విరక్తిభావమూని యుండ నదియె యదనని భృత్యులందఱు "దేవా! నక్కయేడ? మాంసమును దినకుండుటెడ? ఇన్నినాళ్ళ నుండియు మీకుఁ దెలియకుండఁ దెచ్చియుంచిన మాంసంబునందుఁ గొలఁదిగనో యెక్కుడుగనో మెక్కుచునే యున్నది. మే మెన్నియోమారులు కనులారఁ గాంచియుంటిమి. కాని దేవర కెక్కడ మాపైఁ గోపమువచ్చునో యని భయపడి చెప్ప

కుంటిమి.' అని యనేక విధంబుల నాజంబుకోత్తమునిపై లేని పోనివికల్పించి నమ్మునటులఁ బల్కఁ బులియు దూరమాలోచింపక భృత్యులమాటలన్నియు నిక్కవములని నమ్మి తాను ముగ్నానక్కతోఁ జేసిన ప్రతిజ్ఞనేనియుగణింపక యానక్కను జిత్రవధగావించి రండని సహచరుల కాజ్ఞాపించెను. అంతకు మున్నే యానక్క జరిగిన వృత్తాంతంబునంతయు గ్రహించితుద కెట్లు పరిణమించునో చూతమని యొక్కచో డాగియుండెను.

అట్లా మృగరాజు సహచరుల కాజ్ఞాపించిన వార్త నెఱింగి యాతని తల్లి చక్కగా నాలోచించి యిదియంతయు సేవకులొనర్చినపని యని యెఱింగినదై కుమారుని జేరంజని 'కుమారా! దూరమాలోచింపక యేకార్యమును జేయం గూడదు. భృత్యులమాటలను నమ్మి యిత్తెఱంగున నా జంబుకోత్తము నవమానించితివి. ఇన్నినాళ్ళు నుండియు నాత నితో సఖ్యంబు నెరపుచు నాతని గుణమెట్టిదో యెఱుంగ కుంటివే? ఆతఁడు నీకొనర్చిన హితోపదేశము వలన నేనియు నాతని నడవడిని గురుతింప నేరకుంటివా? ఇదియేనా నీరాజ రికము. హితుఁడగు మంత్రియున్నఁ జూడలేక యనేక విధ ములఁ గుటిలులు చెరుప యత్నించు చుందురు. అట్టివారి మాటలను నమ్ముటుచితమా? అదిగాక—

గీ॥ మద్ధిమంతుని వలన దు ♦ ర్బుద్ధులధికు
వలన హీనులు రూపసి ♦ వలనఁ జెనఁటి

వారసూయలు సేయుదు ♦ రీరసమున
నింత యెఱుగంగ వలవదే ♦ ఈవు గొడుకా !

క॥ ధర్మ మధర్మము భంగి న
ధర్మము ధర్మంబుమాడ్కిఁ ♦ దనయా తోచుఁ
నిర్మలమతి నరయవలయు
ధార్మికతన కోరువాఁడు ♦ దన కేర్పడఁగన్.

కావున నీవు దూరము విచారింపక యిట్టి యకార్యమునకుఁ గడంగితివి. ఇప్పటికేనియుఁ జక్కగా నాలోచించుకొని యాజంబుకోత్తమునికడకరిగి తప్పు క్షమియింపుమని ప్రార్థింపుము. ఇదియే నీకుఁ దగిన కర్తవ్యమని బోధింప మాతృవచనంబులు శిరసావహించి యానక్కను జేరం జనియెను.

అట్లు శాంతభావమువహించి తనకై వచ్చుచున్న మృగరాజుఁగాంచి తనకుఁ దానయే యెదురరిగి యాతనితోఁ ఓయీ ! రాజా! ఇప్పుడు శాంతము వహించిన లాభమేము న్నది? ఇన్నాళ్ళు నాతోఁ జెలిమి యొనర్చియు నాగుణ మెట్టిదో యెఱుంగవైతివి. నాఁడు నీసహచరుల ముందల చేసిన ప్రతిజ్ఞనేనియు గణింపక యీవిధముగా నన్నవమానించితివి. ఇదియంతయు నీభృత్యులుచేసినదేయని నీతల్లి తెలియఁ జెప్పునంతకును నీవెఱుంగకుంటివి. ఓరీ! మూర్ఖా!

నేను మాంసమును దినువాఁడనో తినని వాఁడనో యించు కేనియు దూరమాలోచింపవలదా ? నీవింతటి జ్ఞానహీనుఁడ వని నేను మొదలే యెఱింగియుండిన నీతోడి సఖ్యంబున కంగీకరింపకయే యుందును. కాని మించిన దానికి వగచిన లాభము లేదు. దూరాలోచనము లేని నీయట్టి యల్ప బుద్ధులయొద్ద మాయట్టివారలుండఁ జనదు, అని ఖండితముగాఁ దెలియఁబల్కి యాతం డెన్ని విధములఁ బ్రార్థించినను నాతని మొర నాలకింపక యాజంబుకోత్తముఁడు యథేచ్ఛం జనియెను.

కావున బాలకులారా ! కార్యములయెడ దూరా లోచన మొనర్పక వర్తించినచో మానవులును, మృగ నాథునివోలె భంగపడుదురు.

## ౭ శుకము—కిరాతుఁడు

గీ॥ "ఆసపాపజాతి యఖిలంబుపైఁ బ్రాఁకుఁ
బసిఁడిమీఁద నేల పాఱకుండు
పసిఁడిమీఁద నాసపాఱిన మనుజుండు
దనకువచ్చు కీడుఁ దలఁపఁగలఁడె."

పూర్వమొక మహారణ్యములో నొక మహో న్నత భూజముపైఁ గూడుగట్టుకొని యొక శుకము తన శాబకములతో వసించుచుండెను. దానికి సమీపమున నొక వెలగ మ్రాని తొఱ్ఱలో నొక సర్పముండెను. ఇట్లుండ నంతకుమున్ను పెక్కు సాఁకులు తన పిల్లలఁగొనిపోయిన కిరాతుఁ డా చిలుక యున్న చెట్టునెక్కి నోరు తెరవని చిలుక పిల్లలఁ దీయుచుండఁ దల్లి చిలుక వానిం గాంచి "ఓయన్నా! నీకితరపక్షులెవ్వియు లభింపలేదా? నోరుదెరువని వీనింజంపినందువలన నీకేమిలాభమున్న" దని పలికెను. "నేను వీనింజంపుటకుఁ బట్టుటలేదు. వీనిని ద్రవ్యమున కమ్మటకుఁ గొనిపోవుచుంటి"నని బదులు సెప్పెను. ఆపలుకులకు శుకము వానికిట్లనెను." నీవు ధనమునకే నాపిల్లలను బట్టుచుంటివి గావునఁ జెప్పుచుంటిని. నీకుఁ గనకమున్న ప్రదేశముఁ జూపెదను. మున్నొకండీసమీపమున దొంగలకు భీతిల్లి ద్రవ్యమును దాచినాఁడు. నీకాస్థలముఁ జూపెదను.

నీవు ధనవంతుఁడ వగుదువు." కీరాంగన పలుకులకుఁ గిరాతుఁడు సంతసించి, దానివెంట బయలుదేరెను. అంతట నా శుకము వానిని వెంటఁబెట్టుకొని సర్పము వశించుచున్న వెలగ మ్రాని చెంతకుఁ దీసికొనిపోయి. యావృక్షముయొక్క తొఱ్ఱఁ జూపి యందులో గావలసినంత కనకమున్న దని చెప్పెను. కిరాతుఁ డాపలుకుల నమ్మి, ధనముపై నాశచేఁ దొలటలో జేయిఁదూర్చెను. వెంటనే యందుండి భీషణో రగంబొక్కటి విషానలజ్వాలలఁ గ్రక్కుచు నీవలకు వచ్చి వానిం గఱచెను. వెంటనే వాఁడు మృతుండయ్యెను.

క॥ తనచే నసాధ్యుఁడగు శ
త్రుని నన్యునిచేతనైనఁ ♦ ద్రుంగునటులుగా
నొనరింపవలయుఁ దానెఱుఁ
గనివాఁడును బోలె నీతి ♦ కౌశలమెసఁగన్."

# ౮ ఎలుక—పాము

ఒకఁడొక యుగ్రసర్పమునుఁబట్టి వెదురుపెట్టెయం దెట్టి దాని కాహారముగా నొక యెలుక నందుంచి యొకచోట నుంచెను. ఆసర్పము మూషికమును బట్టుకొనఁ దలంప నయ్యది భయమందక యురగమునుగాంచి యిట్లు పలికెను. "ఓసర్పరాజమా! నాకభయంబిమ్ము, నేను నీకుపకారముఁ జేసెదను. నాతోడ నీవు చెలిమిఁజేసితివేని నీవు శుభంబుల నందఁగనవు. నన్ను బట్టుకొని యీపాముల వాఁడెప్పుడు నీ కాహారముగా నిందుఁబడవైచెనో యప్పుడే నేను చచ్చిన దానినైతిని. చచ్చియున్న నన్నుఁజంపనేల? నాచేతఁగాని పని యీయెలుకచేత నగునాయని నీవు సంశయింప వలదు. ఒక్కొక్క సమయమున సద్విజుఁడైనను దీన కార్యము కొఱకు చండాలుని యింటికిఁబోవును. కావున నేను జెప్పి నట్లు చేసితివేని నీవిచెఱను బాయఁగలవు. చెఱనుబాసి నీవు యథేచ్ఛగాఁ జిట్టెల్కలను, గప్పలను, బల్లులు, మొదలగు వానిని భక్షించుచు భోగముల నందఁగలవు" ఈమాటలువిని సర్పము "నేను గలనైన నీకపకారముఁ దలంపను. నాకుప కార మొనర్పు" మనెను. అందులకా యెలుక "నేను నీతలపై నిలిచి యొక మంత్రము జపించెదను. నాజపము పూర్తియగు నంతవఱకును నీవు కన్నులు మూసికొని యుండుము. తరు

వాత నేను బిలిచెదను. అప్పుడు నీకుఁ జెఱవిముక్తి యగు" నని పలికి, సర్పమును సమ్మతింపఁజేసి, దానితలపై నెక్కి కరండమును గొఱికి నెమ్మదిగా నావలకుఁ బోయెను. అనంతరము సర్పము కన్నులు విప్పిచూచి, యెలుక తన్ను మోసగించి పోయినందులకు నగచి, యది చేసిన మార్గమునఁ జెఱ విముక్తి నంది ప్రాణముల రక్షించుకొనెను. తరువాత నా సర్పము మూషికంబుండు బిలద్వారంబెఱింగి, యచ్చటికిఁ బోయి, "ఓమూషికమా! నేనునీకుఁ బ్రాణసఖుఁడను. నాకడకు రమ్ము! ఇరువుర మొకచోట సుఖముగా నుండ" మని పిలిచెను. అప్పు డెలుక మృద్బద్ధంబయిన బిలద్వారమున నిల్చి పాముంగాంచి "నన్ను నీవు రక్షించితివి. నీకు నేను చెఱవిముక్తిఁ గావించితిని. మనకిరువురకు నీమాత్రము స్నేహము చాలును. నేను హీనబలుడ నగుటచేత నీతోఁ జెలిమి సేయశక్తుఁడఁగాను. ఇదియుంగాక నాకు నీవు సహజ విరోధివి. ఇరువురముఁ గార్యార్థులమగుట వలనఁ గొంచెము సేపు మిత్రులమై యుంటిమి. నిన్ను నమ్మి నేను వెలికి రాఁజాల" నని ప్రత్యుత్తర మొసంగెను. ఆ మాటలకుఁ బాము సిగ్గుపడి వెడలిపోయెను.

"క॥ నమ్మకపోరాదను తఱి
నమ్మి రిపునిఁ గలసి నమ్మ! నడచుట యొప్పుఁ

బిమ్మట నేమఱక తొలఁగి
నమ్మక యుండంగవలయు ? నరవరవానికా."



## ౯ కచుఁడు

శుక్రాచార్యుఁడను బ్రాహ్మణుఁడు గలఁడు. ఆతఁడు మహామహిమగలవాఁడు. మఱియు నీతఁడు రాక్షసులకు గురుఁడైయుండెను. ఆతనియొద్ద మృతసంజీవనియను పేరుగల యొక మహావిద్యయుండెను. అది మఱియెవ్వరియొద్దను లేదు. ఆ విద్య యొక్క మహిమచేత నతఁడు రణనిహతులగు రాక్షసుల నందఱను బ్రదికించుచుండెను. ఆ విద్య నెట్లయిన గ్రహింపవలయునని దేవతలు పెక్కు ప్రయత్నములు చేసిరి. కాని లాభము లేక పోయెను. తుదకు వారు తమ గురుపుత్రుఁడయిన కచుఁడను వానిం జూచి "నీవు మాగురుఁడైన బృహస్పతికిఁ బుత్రుఁడవగుటచే మాకుఁ బూజ్యుఁడవు. నీ వలన మాకొక కార్యము గావలసియున్నది. రాక్షసులకు గురుఁడైన శుక్రాచార్యునియొద్ద మృతసంజీవనియను విద్యగలదు. దాని మహిమచేత నాతఁడు సంగ్రామనిహతులైన రాక్షసుల నందఱను బ్రదికించుచున్నాఁడు. ఆ కారణమున రాక్షసులు మనపై

యుద్ధమున నెప్పుడును వచ్చుచుందురు. ఆ విద్య మనయొద్ద లేదు. ఆ కారణమున వారిని జయించుట మనకుఁ గష్టముగా నున్నది. కావున నీవు మాయందు దయయుంచి, శుక్రునిఁ జేరి, యా విద్యను గ్రహించి వచ్చి యమరులను గాపాడు''మని వినయపూర్వకంబుగఁ జెప్పిరి. అందులకుఁ గచుఁడు వారిఁజూచి " దేవతలారా! ఈ కార్యమునకై మీరు నన్నింతగా బ్రతిమాలవలయునా? దేవకార్యము నాకును గావలసినదే కదా! నేను శుక్రునియొద్ద శిష్యునిగ జేరి విద్యల నభ్యసించుచు నెమ్మదిగా మృతసంజీవని విద్య గ్రహించి వచ్చెద'' నని బదులుచెప్పి వారికి సంతోషము గలిగించెను.

తరువాతఁ గచుఁడు శుక్రునియొద్దకుఁబోయి 'దేవా! నేనమరగురుఁడైన బృహస్పతిఁ దనూజుఁడను. కచుఁడను వాఁడ. నీయొద్ద విద్య నేర్చుకొనుటకు వచ్చితిని. కరుణించి శిష్యునిఁగాఁ జేకొను" మని ప్రార్థించెను. శుక్రుఁడాతనిని శిష్యునిగాఁగొని సకలవిద్యలు గఱపుచుండెను. బృహస్పతి కొడుకు తనయొద్ద విద్యలు నేర్చుకొనుటకు వచ్చెఁగదాయని యతనియందు మిక్కిలి ప్రేమను జూపుచుండెను. శుక్రుని తనూజయగు దేవయాని కచునియందు బద్ధానురాగయై యుండెను.

కచుఁడు మృతసంజీవనివిద్య గ్రహించుటకు వచ్చి నాఁడని రాక్షసులు గ్రహించి, యొకనాఁడాతనిం జంపి యడవిలోఁ బాఱవైచిరి. సాయంకాల మయినను గచుఁడింటికి రాకపోవుటచే శుక్రుఁడాతనిని వెదకుచుఁ బోయి చచ్చిపడి యున్న యాతనిం జూచి మృతసంజీవని వలన బ్రదికించి తోడి తెచ్చెను. ఇట్లుండ రాక్షసు లొకనాడు కచుని చంపి, కాల్చి, యాబూడిదను సురలోఁ గలిపి శుక్రునకిచ్చి త్రాగించిరి. శుక్రునకు సురాపాన మలవాటున్నది. అందుచేత నాతఁడు వారిచ్చిన మద్యముఁ ద్రాగెను. నాటి దినము సాయంకాల మైనది. కచుఁ డింటికిరాలేదు. కచుని యందను రాగముతో నున్న దేవయాని బెంగఁగొని తండ్రిం జేరి "నాయనా! బృహస్పతికిఁ బుత్రుఁడు మీయందుఁ గడుభక్తుఁ డూని యున్నవాఁడు. ఆకచుఁ డింతవఱకును గృహమునకు రాలేదు. చీకటి పడుచున్నది. రాక్షసు లాతనికేమి యపాయముఁ జేసిరో యని సంశయ మగుచున్నది. కావున నాతని విషయ మాలోచింపుడు. అతఁడు వచ్చువఱకు నేనన్నము ముట్టను. నీరుద్రావను." అని పలికెను. అప్పటికి శుక్రునకు మద్యపానము వలనఁ గలిగినమత్తు కొంచెము తగ్గెను. ఆతఁడు తన దివ్యదృష్టివలని రాక్షసులు గచునింజంపి, కాల్చి బూడిదను సురలోఁ గలిపి తనచేఁ ద్రావించిరని తెలిసి కొనెను.

ఇప్పుడు కచుఁడు శుక్రుని కడుపులో నున్నాఁడు. శుక్రుఁడు తన విద్యా మహిమచేఁ గచుని బ్రదికించెను. కాని, యాతఁడీవలకుఁ వచ్చుమార్గముఁ గానక యుదరంబున నుండి "మహాత్మా! నేనెట్లు వెలికివత్తు" నని యడిగెను. మృతసంజీవని మంత్రమప్పుడు కచునకుఁ జెప్పక తప్ప దయ్యెను. శుక్రుఁడు కచునితో "కచుఁడా? నీకు మృతసంజీవని మంత్ర ముపదేశించుచున్నాను. నీకు నాకడుపుఁ జీల్చికొని యీవలకువచ్చి తరువాత నన్ను బ్రదికింపుము." అని పలికి మృతసంజీవని మంత్రి ముపదేశించెను. అంతటఁ గచుఁడు శుక్రునికడుపుఁ జీల్చికొని యీవలకువచ్చి మృతుండైన శుక్రుని బ్రిదికించెను. శుక్రుఁడు సారాయముఁ ద్రాగుటవలన నట్టిది సంభవించెనని గ్రహించి మద్యపానము వలనఁ బాప మొదవునని శాసించెను.

ఇట్లు మృతసంజీవని విద్య గ్రహించి కచుఁడు తన లోకమునకుఁ బోవుటకుఁ దలంచి యుండగా దేవయాని యాతనిం జేరి తన్నుఁ బెండ్లియాడుమని కోరెను. అందులకు గచుఁడు "నీవు నాకు గురుపుత్రివి. సోదరివంటి. దాన" వని పలికి నిరాకరించెను. ఆమాటలకు దేవయాని యలిగి "నీవు నేర్చిన మృతసంజీవని విద్య నీకుఁ బనిసేయకుండుఁ గాక" యని శపించెను. అందులకుఁ గచుఁడామెనుజూచి "నాకుఁ

బనిసేయక పోయినను నాచే నావిద్య నుపదేశమందిన వారికిఁ బనిసేయుఁగాక! నిన్ను క్షత్రియుఁడు వివాహమాడు గాక!" యని పలికి సురలోకమున కరిగెను. ఈతని శాపము వలననే దేవయానిని యయాతియను రాజు పెండ్లియాడెను.



# ౧౦ కుశలవులు

శ్రీరాముఁడు తండ్రి వాక్యముఁ బరిపాలించుటకుఁ బదునాల్గు వత్సరము లరణ్యమున వసించి సీతాలక్ష్మణ సహితుండై యయోధ్యకుఁ జనుదెంచి పట్టాభిషిక్తుఁడయ్యెను. కొన్నాళ్ళకు సీత గర్భము ధరించెను. కౌసల్య మొదలయిన వారు సీతకు రఘుకుల వర్ధనుఁడగు సుపుత్రుఁడు జనించునని సంతోషముతో నుండిరి. రాముఁడునట్ల సంతసించుచుండెను. ఈసంతోషమునకు భంగము గలుగునని యెవ్వరు ననుకొన లేదు. ఎవ్వఁడో యొక రజకుఁడు తన భార్యతోఁ గలహించుచు మాటల సందర్భమున "రావణునిచేఁ గొనిపోవఁబడి కొంతకాలము లంకయందున్న సీతను మరల రాముఁడు దెచ్చుకొని యేలుచున్నాఁడ"ని పలికెను. గూఢచారుల వలన రాముఁ డదియెఱింగి తన కట్టినింద వచ్చెనని విచారించి

దానిం బాపుకొనుటకు లక్ష్మణుని బిలిచి యావృత్తాంతము దెలిపి సీతను గంగాతీరమున నున్న యరణ్య మధ్యమున విడిచిరమ్మని చెప్పెను. అట్లు సేయుట ధర్మము గాదని లక్ష్మణుఁడెంతయో బ్రతిమాలి చెప్పెను. కాని రాముఁడు వినలేదు.

రామాజ్ఞను లక్ష్మణుఁడు నెఱవేర్చవలసిన వాఁడయ్యెను. అతఁడు నెమ్మదిగా సీత సన్నిధికరిగి "తల్లీ! నీవు గంగాతీరమున నున్న మునిపత్నులను జూడవలయునని రామచంద్రుని నడిగియున్న కారణమున నిన్నక్కడకుఁ గొని పోవలసినదని నాకాజ్ఞయిచ్చినా"డని పలికెను. అమాయకురాలగు సీత యందుకు సంతసించుచు లక్ష్మణుఁడు తెచ్చిన రథమెక్కి బయలుదేరెను. లక్ష్మణుఁ డామెను గంగానది దాటించి యరణ్యమునకుఁ జేర్చి రాముని యాజ్ఞఁ దెలుపలేక చింతింపఁ దొడంగెను. అతని దుఃఖముఁ జూచి సీత యందులకుఁ గారణమడిగెను. ఎట్టకేల కాతఁడు ధైర్యమవలంబించి, రాముని యాజ్ఞ నామెకుఁ దెలిపెను. అందుల కామె యెంతయో దుఃఖించెను. ఆమె దుఃఖమును జూడఁ జాలక లక్ష్మణుఁడుగూడ విలపించెను. లక్ష్మణుఁడచ్చట నుండుటకు వీలులేదు. అందుచే నాతఁడు జానకింజూచి "తల్లీ! నేను పురమునకు మరలిపోవక తప్పదు. సంధ్యా

సమయమునకు రమ్మని రాముని యాజ్ఞయై యున్నది. నిన్ను విడిచిపోవుటకు నాకుఁగాళ్ళాడకయున్నవి. ఇక్కడనీకుదిక్కెవ్వరు? ఎవ్వరురక్షింతురు? నీగర్భస్థ సంతానము నెవ్వరు గాపాడుదురు?'' అని పలికెను. అందుకు సీత యిట్లనెను. "లక్ష్మణా! నీవునన్నుఁగూర్చి విచారింపవలదు. సీతకాజన్మాంత మరణ్యములయందు వసించునట్లు బ్రహ్మ వ్రాసినాఁడు. దానిని దప్పింప నెవ్వరు సమర్థులగుదురు? నీవు విచారింపక పురమునకుఁ బొమ్ము. నాకర్మ మెట్లున్న నట్లగును.'' అని పలికి, కౌసల్యాదులకును, మఱఁదులకును, జెల్లెండ్రకును జెప్పవలసిన మాటలఁజెప్పి, రామునకిట్లు చెప్పుమని చెప్పెను. "దేవా! రామచంద్రా! నిందఁ బాపుకొనుటకు నన్నరణ్యములకుఁ బంపితివని నేను విచారింపనుగాని నీ దివ్యపాదారవింద సేవకు దూరమైతినని మాత్రము విచారించెదను. మీసూర్యకుల మాచంద్రతారకముగ యశమందుచు వర్ధిల్లవలయును. నే నీ యరణ్యమున నున్నను నీ నామస్మరణఁ జేసికొనుచు జీవయాత్రఁ గడుపుదును.

అంతట లక్ష్మణుఁ డామె సెలవుఁబొంది, వెనుకకుఁ దిరిగితిరిగి చూచుచు నచ్చోటువాసెను. మహారణ్యమధ్యమున నొక్క సీతయేయున్నది. తనకిట్టి దుర్గతి సంభవించెనని ఘోరముగ విలపించుచుండెను. అట్టి సమయమున

నచ్చుటికి సమిత్కుశ ఫలార్థమై వాల్మీకమహర్షియరుదెంచి, సీతంగాంచి, యామె వృత్తాంతమంతయు దివ్యదృష్టి నెఱింగి, యామెకు ధైర్యముఁ జెప్పి తన యాశ్రమమునకుఁ దోడ్కొని పోయెను.

సీతకు సపర్యల సేయుటకుఁ దాపసకన్యల నియమించి వాల్మీకి యామెను జనకునివలె సాకుచుండెను. ఆమె యాతని యాశ్రమమునఁ గుశలవులను కుమారులను గాంచెను. దిన దిన ప్రవర్థమానులగుచు నాకుశలవులు సీతకును భగవానుఁ డయిన వాల్మీకికిని ప్రమోదముఁ గలుగఁ జేయుచుండిరి. కాలక్రమమున వాల్మీకి కుశలవుల కక్షరాభ్యాసముఁ జేయించి తాను రచించిన రామాయణ కావ్యమును గానరూపముగా వారికి నేర్పెను. ఇట్లు గుశలవులా మునీంద్రుని యాశ్రమమున వర్థిల్లుచుండిరి.

అక్కడ రాముఁడశ్వమేధ యాగముఁ జేయనెంచి భూమండలమెల్లఁ జరించివచ్చుట కశ్వము ముఖమున "వీరులయినవారు దీనింబట్టు"డని బిరుదపట్టముగట్టి విడిచెను. అయ్యది వాల్మీకాశ్రమ ప్రాంతమునకు వచ్చి కుశలవులచేఁ బట్టుపడెను. ఈసందర్భమున భరత లక్ష్మణ శత్రుఘ్నులకును గుశలవులకును గొప్ప యుద్ధము జరిగెను. తుదకు యుద్ధభూమికి రాముఁడుగూడ వచ్చెను. రామునకుఁ గుశలవులు దన కుమారులని తెలియదు. కాని, రూపములను

బట్టి సంశయించి "బాలకులారా? మునికుమారులగు మీకు రాజులతో యుద్ధముసేయుట తగదు. మీ కేమికావలసిన నది యిచ్చెద. యాగాశ్వమును విడువు"డని పలికెను. కుశలవ లామాటలకు మేము శూరులము కావున యాగహయమును బంధించితిమి. నీవు వీరుఁడవేని విడిపించుకొని పొమ్ము." అని పలికి యుద్ధమునకుఁ గడంగిరి. ఆయుద్ధమున రాముఁడు మూర్ఛిలెను.

ఈవిధమంతయు మునిబాలురచే విని, సీత, చింతింపఁ దొడంగెను. అప్పుడు వాల్మీకి వరుణలోకమునుండి వచ్చి జరిగిన సంగతి నంతయు విని యుద్ధభూమికి వచ్చి, మూర్ఛ నందినవారిపైఁ దన కమండలూదకమును జల్లెను. అంతట నందరును నిద్రనుండి లేచిన వారిచందమున లేచిరి. అప్పుడు సీతం గూర్చి వాల్మీకి రామునకుఁ దెలిపి కుమారులగు కుశ లవుల నప్పగించెను. కొడుకులఁ జూచి రాముఁడు మహా నందమును బొంది, పుత్రవతియగుసీతతోఁ బురమునకుఁ బోయి యశ్వమేధమును బూర్తిగావించెను.



# గురువు—శిష్యుఁడు

పూర్వము కాంచీనగరమును ధర్మపాలుఁ డనురాజు పరిపాలించు చుండెను. ఆతఁడన్ని విధముల గణింపఁదగిన వాఁడు. మఱియుఁ బెక్కండ్రు శత్రురాజుల జయించి రారాజను పేరున నిర్వక్ర పరాక్రమంబున సకల క్షోణీతలంబును బరిపాలించుచుదిగంతములవఱకు నిజకీర్తిద్యుతుల వ్యాపింపఁ జేసెను. కాలచక్ర మెప్పుడొకరీతిగాఁ బరిభ్రమింపదు. అది క్షణ క్షణమునకు మారుచునే యుండును. సమస్త సంపదలతోఁ దులదూగు ధర్మపాలునకు మంచి దినములు సెల్లి పోయినవి. అంతవఱకు నతని యధికారమునకు లోఁబడి యున్న రాజులందఱు నొక్కమాఱుగ నతని నెదిర్చిరి. నలువురు నలుప్రక్కలఁ గ్రమ్ముకొన నతఁడేమి సేయఁగలఁడు? తుద కతఁడు వారలతోఁ గొంతవఱకుఁబోరి గెలువలేక రాజ్యపదవిని గోల్పోయినవాఁడై కట్టు గుడ్డలతోడను, నాలుబిడ్డలతోడను, వనములపాలయ్యెను. ఆహా! ఏకాలమున కేమి ప్రాప్తించునో యెవ్వరుఁ జెప్పఁజాలరు గదా?

ధర్మపాలుఁ డట్లు వనంబుల వసించుచు నెట్టెటులో కుటుంబమును బోషించు చుండెను. అతని కిరువురు కుమారులు గలరు. పెద్దవాఁడు వీరసింహుఁడు. రెండవవాఁడు శూరసేనుఁడు. కుమారులు విద్యాభ్యాసమునకుఁ దగిన

ప్రాయము గలవారై నప్పటినుండి ధర్మపాలునకు విచారము మెండయ్యెను. ఎవరియొద్ద వారికి విద్య గఱపింపఁ గలఁడు? ధనమువలనఁ జెప్పింతమన్న నతనిచేతఁ జిల్లిగవ్వ యేనియు లేదు. ఉచితముగాఁ జెప్పింతిమన్న విద్య చక్కఁగా గఱపఁ బడునో లేదో? పాపము! అతఁడు పేరునకు మాత్రమేరాజు. పూర్వము రారాజుగదాయని గౌరవించు వారుందురా? ధర్మ పాలుఁడిట్లు కుమారుల విద్యకై విచారపడుచుఁ దుద కయ్యా రణ్యంబునకు సమీపంబుననేయున్న యొక పల్లెకుఁ దన కుమారులఁ గొనిపోయి యందు సకల విద్యాప్రవీణుఁడని పేరుగాంచిన గురుమూర్తియను గురూత్తమునిసందర్శించెను. అతఁడును ధర్మపాలునిఁ దగినరీతిని సత్కరించి వచ్చిన పని యేమని ప్రశ్నించెను. అంత ధర్మపాలుఁడుదన పుత్రుల నతనికిఁజూపి 'స్వామీ! వీరు నాకుమారులు. ఇంతవఱకు విద్యాగంధమెట్టిదో యెఱుంగనివారు. కాలవశమున మాకిట్టి దుస్థితి సంభవించినది. ధనమువలన నాకుమారులకు విద్య నేర్పింపఁ జాలకున్నవాఁడ. కావున నావిన్నపం బాల కింపుఁడు. ఈకుమారు లిద్దరకు మీరు విద్యగఱపుఁడు. దీనికిఁ బ్రతిఫలముగా నీయిరువురిలో నొక్కని మీరు గైకొనుఁడు. ఇదియే గురుదక్షిణయని భావించి వీరికి విద్య గఱపు' డని పల్కెను. అందుకు గురుమూర్తియు సంతోష పూర్వకముగ సమ్మతించెను.

ధర్మపాలుఁడట్లు గుమారుల నప్పగించి నిజ నివాసంబున కరిగిన యనంతరము గురుమూర్తి యారాకుమారుల యెడఁ దగిన శ్రద్ధవహించి విద్యగఱపఁ దొడంగెను. కాని చిన్నవాఁడగు శూరసేనుఁడు సర్వవిధముల నగ్రజుని మించి పోవుచుండెను. అదిగాంచి గురుమూర్తి చిన్నవానిఁ దాను గైకొనఁ దలంచినవాఁడై పక్షపాత బుద్ధివహించి వీరసింహునకంతగా శ్రద్ధవహించి విద్యగఱప కుండెను. ఈకారణమున వీరసింహుఁడు నానాటికిఁ దమ్మునికంటె విద్యాజ్ఞానమునందుఁ దగ్గిపోవుచుండెను. శూరసేనుఁడు మాత్రము గురుని దురభిప్రాయ మెఱింగినవాఁడై తన తండ్రికి కతఁడు సేయనున్న మోసమునకుఁ దగిన ప్రతీకార మొనర్ప సమయమునకై వేచియుండెను. గురుమూర్తికిఁ బరకాయప్రవేశ విద్యాజ్ఞానముగూడఁ గలదు. ఆవిద్యనుగూడ శూరసేనున కతఁడు బోధించెను. ఇప్పటి కన్నివిధముల శూరసేనుఁడు గురునితో సమానుఁడయ్యెను. వీరసింహుఁడు మాత్రమెందుకుఁ గొఱగాని వాఁడయ్యెను.

ఇచ్చట వనంబున ధర్మపాలుఁడు గుమారుల విద్యాప్రావీణ్యంబునుగూర్చి యనిశముఁ దలపోయుచునేయుండెను. ఇట్లుండ శూరసేనుం డొకనాటిరాత్రి పరకాయ ప్రవేశవిద్యవలనఁ బక్షిరూపంబును ధరించినవాఁడై తల్లి దండ్రుల

యొద్ద కరుదెంచెను. ధర్మపాలుఁడు కుమారుని రాకకు మిపుల సంతోషించి, యంతటి యర్ధరాత్రంబున నతఁడట్లు వచ్చుటకుఁ గారణం బేమని ప్రశ్నించెను అంత శూరసేనుఁడు దండ్రిఁజూచి 'నాయనా! గురూత్తముఁడు మాయందు పక్షపాతబుద్ధివహించి నన్నుఁ దానుగైకొన వలయునని సమస్త విద్యలను నాకుఁగఱపినాఁడు. అన్న కేవలము విద్యావిహీనుఁడై యున్నవాఁడు. కావున నతనిని మీరు గోరవలదు నన్నే కోరుకొనుఁడు. కష్టకాలంబున నక్కఱపడని కుమారునివలన మీ కేమి ప్రయోజన ముండును? ఈసంగతిని మీకుఁ దెలుపుటకై నేనిట్లరుదెంచితిని. కావున నెల్లి సూర్యోదయంబున మీరట కరుదెంచి నేఁజెప్పినట్లు సేయు' డని తెలిపి యప్పుడే గురుని మందిరంబున కరిగెను.

అనంతరము ధర్మపాలుఁడు కుమారుండు సెప్పిన గడువుదినమునకు గురునియొద్ద కరిగెను. గురుమూర్తియు ధర్మపాలుని నర్హావిధుల సత్కరించి 'రాజా! నీకుమారులకు నానేర్చినయట్లు చక్కగా విద్యగఱపితిని. అన్ని విధములఁ బెద్దవాఁడు సమస్తవిద్యలయందుఁ బ్రవీణుఁడై యున్నవాఁడు. చిన్నవాఁడన్ననో విద్యాజ్ఞాన మంతగా లేనివాఁడు. ఇది యున్నసంగతి. ఇంక మీయిచ్చవచ్చిన వానిఁ గోరుకొను' డని చెప్పెను. ధర్మపాలుఁడప్పుడు కుమారుఁడు సెప్పిన

దానిని గురువు సెప్పినదానిని దూరము విచారించి గురునిం జూచి ‘అయ్యా! మీఋణమెట్లును నేను దీర్చుకొనం జాలను. కష్టపడి విద్యగఱపినవారు మీరు. కావున సర్వవిద్యా ప్రవీణుండైన పెద్దవానినే మీరు గైకొనుఁడు. కష్టపడినవాఁడే గదా యనుభవింప వలసినవాఁడు? ఇంతగాం గష్టపడిన మీకు మంచివాని నొసంగకున్న రాజెంతటి స్వార్థపరుం డురాయని నన్నెల్లరు దూషింతురు. నేను సడికోర్వంజాలను. కావున నేను జిన్నవానినే కైకొందు’ వనిచెప్పి యప్పుడే శూరసేనుంగొని నిజనివాసంబున కరిగెను. పాపము! గురుమూర్తి యన్నివిధములం హతాశుఁడయ్యెను. తానొకటి తలంచిన దైవమొకటి తలంచెను.

‘అవశ్యమను భోక్తవ్యం
కృతంకర్మ శుభాశుభమ్’

అను న్యాయమునుదలంచి గురుమూర్తి సంతృప్తిపడెను. సంతృప్తిపడక యాతఁడు సేయునదేమిగలదు? ఎట్రింగి యెఱింగి యొకరిని మోసగింపం దలంచినం దత్ఫలంబు కట్టికుడుపక మానునా?

ధర్మపాలుండట్లు శూరసేనునితో నిజనివాసంబున కరిగిన యనంతర మొక్కనాఁడు కుమారునిజూచి ‘నాయనా! మనకీ కష్టదశ యంతరించు తెఱంగు నూహింపుము.’ తిను

టకుఁగూడ లేకున్న వారము. ఎన్నినాళ్లని యీరీతి మనగల
మని పలుక శూరసేనుండును 'తండ్రీ! పొట్టకూటికై మీరెంత
మాత్రమును విచారపడవలదు. రాజ్యప్రాప్తి యందురా?
దైవవిధాన మెట్లున్నదో యెవ్వరు సెప్పఁగలరు? మనకీ యర
ణ్యంబుల నుండ బనియేమి? వేఱొక పట్టణంబున కరుగుదము.
లెండని' చెప్పి యప్పుడే తల్లిదండ్రులఁదోడ్కొని యవంతీ
నగరంబున కరిగెను.

అవంతీ నగరంబును గామపాలుండను రాజు పరి
పాలించు చుండెను. అతఁడు మహాబుద్ధిమంతుఁడు. అతనికిఁ
గోడిపందెములన్న మిక్కిలి యిష్టము. అందుకని యాతఁ
డొక ప్రశస్తమైన పుంజును బెంచుచుండెను. కాని దానితో,
బందెమునకుఁ దగిన పుంజు లభింపదయ్యెను. దాని కొఱకై
కామపాలుఁడు విన్న చోటులయందెల్ల వెదకించు చుండెను.
శూరసేనుండీ వృత్తాంతము నెఱింగినవాఁడై తండ్రిఁజూచి
'నాయనా! కామపాలుఁడు పందెమునకుఁ దన పుంజునకుఁ
దగినపుంజునకై వెదకించు చున్నాఁడట, మదీయ విద్యా
ప్రభావంబు వలన నేనిప్పుడే యొక శ్రేష్ఠమైన పుంజు
నయ్యెదను. అప్పుడు నన్నుఁ దగినవెలకు విక్రయించి
ధనంబుగొనుము. నేను నచిరకాలంబు నందె తిరిగి మిమ్ము
గలసికొనెద' నని చెప్పి యప్పుడే పుంజురూపమును ధరించి

యెల్లరు నాశ్చర్య పడునట్లు 'కొక్కొ-రోకో' యని కూసెను. ఆకూత విన్నంతనే రాజభటులు తమకృషి నేటికి ఫలించెనని సంతసించి దాని సమాచారమును గామపాలున కెఱింగించిరి. కామపాలుండును బుంజు లభించెఁగదాయను సంతసంబున నపరిమిత ధనంబొసంగి దానింగొనెను. ధర్మపాలుండా ద్రవ్యముంగొని నిజ నివాసంబునకరిగి కుమారుని రాకకై యెదురు సూచుచుండెను.

ఆనాటిరాత్రి పుంజురూపంబుననున్న శూరసేనుఁడొక కొక్కు-రూపమును ధరించి తానున్న యింటిగోడనుద్రవ్వి వెలికిఁ జనుదెంచినవాఁడై యెప్పటి రూపంబునఁ దండ్రి యొద్ద కరిగెను. మఱునాఁడు గామపాలుండు పుంజుఁగానక యందుఁ గొక్కు-త్రవ్విన బిలంబుసూచి యదియే పుంజునీడ్చి కొని పోయెనని తలంచెను. పాపము! అతనికిఁగల రూపెంత మాత్రమును దెలియదు. శూరసేనుండట్లు దండ్రికడకరిగి గడించిన ధనంబుతోఁ గొంతకాలము సుఖజీవన మొనర్చెను. ఇంతలోఁ దొల్లింటిస్థితియే సంభవించునన్నట్లు ధనము సాలవఱకు వ్యయమయ్యెను. అప్పుడు శూరసేనుండుపేక్షసేయక యొకనాఁడు తండ్రిఁజూచి 'జనకా! ధనమంతయు వ్యయముఁ జొచ్చినది. దీపముండఁగనే యింటిని క్కఁబెట్టుకొనుట మంచిది. కావున నేనిప్పుడే యొక పంచ

కల్యాణిరూపమును ధరించెదను. నన్నుం గొనిపోయి తొల్లింటి యట్ల విక్రయించి ధనంబు గొనుము. నేనును రాత్రియగు నంతకు మిమ్ముఁ గలిసికొందు' నని చెప్పి యప్పుడే యొక దివ్యాశ్వమయ్యెను. సల్లక్షణములతో నొప్పు నాగుఱ్ఱముఁగొని ధర్మపాలుండు విక్రియస్థానమున కరిగెను. ప్రతివారును, దాని సురుచిరాకారమునకు వింత పడఁజొచ్చిరి. అట్టియెడ నాపట్టములోని యొక ధనికుని కుమారుఁ డడిగిన వెలయిచ్చి యాగుఱ్ఱమును గొని గృహమునకుఁ గొంపోయెను. అప్పుడాతని గృహమునందు శూరసేనునకు విద్యసెప్పిన గురుమూర్తి యుండెను. ఆ ధనికుని కుమారుఁడు గురుమూర్తిఁ జూచి "స్వామీ! ఈ గుఱ్ఱమును మిక్కిలి వెలకుఁగొంటిని. దీనిఁ పరీక్షింపుఁ'డని పలుక గురుమూర్తియు దాని చెంతకరుదెంచి చక్కఁగాఁ బరీక్షించినవాఁడై, తన శిష్యుఁడైన శూరసేనుఁడే యట్లుండెనని గ్రహించెను. శూరసేనుండును దన గురుపును గుర్తించెను. గురుమూర్తి యిట్లు శిష్యునిగుర్తించి, తగిన సమయము లభించెఁగదాయని యుప్పొంగి, యా ధనికుని కుమారునిఁ జూచి "ఓయీ! ఈ గుఱ్ఱము మిపుల వడిగలది. దీనిని సామాన్యులైన వారెక్కఁజాలరు. కావున ముందుగ నే నెక్కి కొంతవఱకు దీని పొగరణంతు'నని చెప్పి యాగుఱ్ఱమును నతఁడధిరోహించెను. అరూపున నున్న శూరసేనుండును

గురుని దుస్స్వభావమును తెలిసికొని, తానుగూడఁ దగిన ప్రతీకారము సేయ నిశ్చయించుకొనెను.

గురుఁడట్లా గుఱ్ఱంబు నధిరోహించినంతనే యదియు, మనసుకంటెను, గాడ్పుకంటెను,మించినఁ వేగంబున బెక్కుపట్టణంబులఁ గడచిచని, తిరిగి యథాస్థానమున కరుదెంచెను. అంత నసూయాగ్రస్తచిత్తుండగు గురుమూర్తి యాగుఱ్ఱంబును సమయింపనెంచి యొక మఱికి నీటిగుంటకుఁగొనిపోయి,దప్పి దీర్చుకొనవిడిచెను. అయ్యశ్వంబు నాతని మదోభిప్రాయంబు నెఱింగి, యున్నయట్లుండి యశ్వరూపంబుఁ దొఱంగి, తన్నికటభూసురుహంబున నున్నయొక రాచిలుక శరీరంబుఁ బ్రవేశించి, ఱివ్వున నెగిరిపోయెను. గురుమూర్తియుఁ దోడన డేగరూపంబును ధరించి. యాచిలుకను వెంబడించెను. చిలుక రూపంబున నున్నశూరసేనుండును డేగరూపధారియగు గురున కందక తన్నగరాధిపుని యంతిపురంబునుజొచ్చి రాకుమారి కరపల్లవంబుపై వ్రాలెను. గురుమూర్తి యింకనేమి సేయంజాలక పక్షి భాషలోఁ దానెట్టులైన నేను రోజుల లోపలఁ జిలుక రూపంబున నున్న శూరసేనుని సమయింపఁ గలవాడని చిలుకకుఁ దెలిపి మరలిపోయెను. చిలుకయు డేగ చెప్పిన దానిని విని జయాపజయంబులు దైవాధీనంబులని మిన్నకుండెను.

అట్లు దన కరపల్లవంబుపై వ్రాలిన చిలుకను, రాకుమారి సమధి ప్రేయంబున నొక బంగారు పంజరంబు నందుంచి పెంపఁదొడంగెను. ఇవ్విధంబున నాఱురోజులుగడచెను. ఈలోపల శూరసేనుండును రాత్రికాలంబునఁ జిలుక రూపంబును బాసి, సహజ స్వరూపంబున రాకుమారుని నిద్రావస్థయందుఁ గలయుచు. నామె మెల్కొనునంతకుఁ జిలుక రూపమును ధరించుచు, నెఱుక పడకుండ మెలంగుచుండెను. రాకుమారియుఁ బ్రతిదింబుఁ దనయందు సంభోగ చిహ్నంబులఁగాంచుచు, వీరభటరక్షితంబైన తన సౌధంబును బరపుషులెట్లు ప్రవేశింపఁ గలరనియు, నట్లు ప్రవేశింపకయే యున్నఁ దనయందు సంభోగ చిహ్నంబు లెట్లుండుననియు, నిట్లనేక విధంబులఁగల రూపునెఱుంగఁ జాలక విచారింపఁ జొచ్చెను. ప్రతిదినంబు నిట్లగుచుండుటవలన నారాకుమారి యాఱవనాటిరాత్రి నిద్రపోవుదానివలె నటించుచుఁగడుమెలకువతోనుండెను. గడువుదినంబు సమీపించుటవలన శూరసేనుండును దన సమాచారంబును రాకుమారికిఁ దెలుపనెంచెను. కావున నాటిరాత్రి రాకుమారి మెలకువతో నుండుట యతనికి లాభకరమయ్యెను. అర్ధరాత్రంబగు నంత శూరసేనుండు చిలుక రూపంబును బాసి, మానవరూపంబున రాకుమారిఁ జేరెను. ఆమెయు మెలకువతో నున్నదగుట వలన వెంటనే లేచి యాతని హస్తముఁ బట్టికొని 'నీవెవర

వని ప్రశ్నించెను. అప్పుడు శూరసేనుండు దనయొక్కయుఁ దనగురునియొక్కయు, సమాచారంబును సవిస్తరంబుగా అమెకుఁ దెలియఁ జేసి 'రాకుమారీ! రేపేగడువు దినము. నాగురుండు దొమ్మరి వాండ్రితోఁ గూడి యిటకరుదెంచి, నీతండ్రి సముఖంబునఁ గడగట్టి తన వాండ్ర నాడించును. నీతండ్రియు వారియాటకు మెచ్చి వలసిన దాని నిత్తునని చెప్పును. అప్పుడు నాగురుండు రాజుంజూచి "మహాప్రభూ, మీపుత్రిక యొద్దనున్న చిలుక నిప్పించుఁ' డని కోరును. దానికై నీతండ్రి నీకడకు వార్తఁబంపును. నీవును జిలుక నియ్యనని కొంతవఱకుఁ జెప్పి, తుదకు మెడ విఱిచి యవలఁ బాఱవేయుము, అప్పుడు నాగురుండు, దానుగోరిన చిలుక చనిపోయెననియుఁ గావున రాకుమారి మెడనున్న ముత్యాల హారమునిప్పించ వలసినదియు, నీతండ్రి గోరును. అందుకు నీతండ్రియు సమ్మతించి దానికై నీయొద్దకు సేవకులఁబంపును. అప్పుడు నీవును గోపము గొన్నదానివలె నటించుచు హార ములోని ముత్యముల దూసిపోయుము. తరువాత జరుగు వింతల నన్నిటిని నీవేచూడఁ గలవు. నేను చెప్పినట్లు మాత్ర ముచేయుము. నేఁడు నీవలన నేబ్రతుకు వడుటకు నిదియేకారణ మనిచెప్పి మెప్పటియట్లు చిలుక రూపంబును ధరించి, పంజ రంబున నుండెను. రాకుమారియు జరుగనున్న వింతలజూచు వేడ్కఁ దవిలియుండెను.

సూర్యోదయ మయ్యెను. క్రమక్రమముగఁ బొద్దు తిరిగెను. శూరసేనుఁడు చెప్పినట్లు గురుమూర్తి దొమ్మ వాండ్రఁ గూడి యట కరుదెంచి రాజు నాస్థానంబున గడఁ గట్టెను. ఇంకఁ జెప్పునదేమి? శూరసేనుండు చెప్పినయట్లు సర్వము జరిగెను. రాకుమారి శూరనులోని ముత్తియంబుల నన్నింటిని దూసిపోసెను. అవియన్నియు నేమి విచిత్రమోం గాని, పురుగు లయ్యెను. అప్పు డెచ్చోటనుండియో యొక కోడివచ్చి, యాపురుగుల నన్నింటి ముక్కుతోఁ బొడిచిచంపి తినఁజొచ్చెను. అయ్యెడ 'మ్యావు మ్యావు' అని యఱచుచు నొక గండుబిల్లి వచ్చి యాకోడి మెడఁబట్టి కోరలతో నొక్క దొడంగెను. అంత నాకోడి మనుష్య భాషణంబున 'శూర సేనా! నేనేయోడిపోతిని. నన్నుఁ జంపకుము. ఎంత దురాత్మ గ్గుండ నైనను, నేను నీకు గురుండను. గురున కెగ్గుసేయుట శిష్య ధర్మముగాదు. నన్ను వదలి పెట్టుము. ఇది వఱకు నొకరిని మోసగింపనెంచి నేనే మోసపోతిని. ఇప్పు డొక రిని జంపనెంచి నేనే చావనుంటిని. అబ్బ! శూరసేనా! కోర లతో నొక్కకుము. ప్రాణములు పోవుచున్నవి' యని బ్రతి మాలఁజొచ్చెను. దీనివలనఁ గోడిరూపంబున నున్నవాఁడు గురుమూర్తియనియుఁ, బిల్లిరూపంబున నున్నవాఁడు శూర సేనుండనియుఁ దెలియుచున్నది. ఈవింత సంభాషణంబు నాలకించి రాకుమారి యేమియుఁ దోచనిదై తన తండ్రికి

వార్తఁబంపెను. కామపాలుండును, నచ్చటి కరుదెంచి కోడి గను, బిల్లిగను, నున్న గురుశిష్యులఁజూచి 'అయ్యలారా! మీరిట్లగుటకుఁ గారణంబేమి?' యని యడుగ గురుమూర్తి శిష్యు నడుగుమనెను. శూరసేనుండు గురువునడుగు మనెను. అప్పుడు గురుమూర్తియే, ధర్మపాలుఁడు తనయొద్దకు వచ్చి, విద్యకై వీరసింహ శూరసేనులఁ దన కప్పగించుటయు, గురుదక్షిణగాఁ జిన్నవానిఁ దాను గైకొనఁదలంచి పక్షపాతబుద్ధితో వారలకుఁ దాను జదువు సెప్పుటయుఁ, శూరసేనుని వలనఁ దాను హతాశుఁడగు టయు, ననంతరము దివాశ్వమైయున్న శూరసేనుని గుర్తించి, పగఁగొని, చంపనెంచుటయు, నతండు చిలుక రూపంబును ధరింపఁ దాను డేగరూపంబును ధరించి వెంబ డించుటయుఁ దుదకట్లు చిక్కుటయు నాదిగాఁగల వృత్తాంత మంతయుఁ గామపాలున కెఱింగించి, తన్ను విడిపింప వలసినదని కోరెను. అప్పుడు కామపాలుని ప్రార్థనంబు ననుసరించి శూరసేనుఁడు గురుని విడిచిపెట్టెను. అంత నయ్యిరువురును మనుష్య రూపంబుల ధరించిరి. కామ పాలుండు శూరసేనుని విద్యాప్రభావంబునకు మెచ్చికొని సుక్షత్రియవంశ్యుఁడగుట వలనఁ దన కుమారి నతనికిని, దనయన్న పుత్త్రికను వీరసింహునకును నొసంగి, శుభ లగ్నంబున వారలకుఁ బెండిండ్లు సేసెను. ధర్మపాలుండు

దనకు మంచికాల మరువెంచెనని సంతసించెను. అనంత రము వీరసింహ శూరసేనులు, కామపాలుని సహాయంబునఁ దమ తండ్రి రాజ్యంబును వశపఱచుకొనిరి. వీరసింహుఁడు తండ్రి రాజ్యమునకును, శూరసేనుఁడు గామపాలుని రాజ్య మునకును, బరిపాలకులైరి.

బాలకులారా! ఈ కథ వలన మీరు నేర్చికొన వలసిన నీతి యిది. విద్య చెప్పినవాఁడు మన కపకార మొనర్చినను, నతనికి హానిసేయక మనము శిష్యధర్మమును బాలింపవలయును. ఇందువలన సర్వశుభములు సమకూరును.



# ౧౨ హరిశ్చంద్రుడు

పూర్వము హరిశ్చంద్రుఁడను రాజు అయోధ్యాపురమును బాలించుచుండెను. ఆతఁడు ధర్మసంధుఁడు. కలనయిన అబద్ధమాడనివాఁడు. దేవలోకమున ఇంద్రసభలో హరిశ్చంద్రుని బొంకింతునని విశ్వామిత్రుఁడును, బొంకింపఁ జాలనని వసిష్ఠుఁడును గలహించిరి. అంతట విశ్వామిత్రుఁడు హరిశ్చంద్రునిచేత నబద్ధమాడించుటకు ప్రయత్నములు మొదలుపెట్టెను. మొదట నాతఁడు హరిశ్చంద్రుని యొద్దకు వచ్చి తా నొక యాగము సేయుచుండెననియు, దానికై యొక్క మనుష్యుఁడు ఏనుగునెక్కి రత్నమును పై కెగుర వేసిన, నెంతయెత్తుపోవునో అంతయెత్తు ధనము నియ్య వలసినదనియు నడిగెను. హరిశ్చంద్రుఁడా సొమ్మంతయు నిచ్చుటకు సిద్ధపడెను. విశ్వామిత్రుఁ డిప్పుడు వలదు. కావలసివచ్చినప్పుడు తీసికొని పోవుదునని చెప్పి వెడలిపోయి, మాయామృగములను సృష్టించెను. అవి పంటచేలను బాడుసేయుచుండగా, హరిశ్చంద్రుఁడు వానిం జంపుటకు భార్యాపుత్రులతో నరణ్యమునకేగెను. అచ్చట హరిశ్చంద్రుఁడు వేటాడి యలసి యొక చెట్టుక్రింద విశ్రమించి యుండఁగా, విశ్వామిత్రుని పంపున నిద్దఱు మాలకన్నియలు అతనియొద్దకు వచ్చిరి. వారాతనిని సంగీతనృత్యములచేత

మెప్పించి కోరరాని కోరికఁ గోరిరి. రాజ భటులు వారి నావలకు గెంటివేసిరి. వారు ఏడ్చుచు విశ్వామిత్రునిజేరి హరిశ్చంద్రుని మీఁదఁ గొండెములు సెప్పిరి. విశ్వామిత్రుఁడు రుద్రుని లీల మండిపడుచు హరిశ్చంద్రుని యొద్దకువచ్చి, మాలకన్నియలను బెండ్లిచేసికొనవలసినదని చెప్పెను. "రాజ్యమయిననూ ఇచ్చెదనుగాని అధర్మకార్యము సేయను. అబద్ధ మాడను" అని హరిశ్చంద్రుఁడు పలికెను. "అట్లయిన రాజ్యమిమ్మని" కౌశికుండడుగ, హరిశ్చంద్రుఁడు కొంచెమయినను సంశయముగాని విచారముగాని పొందక, రాజ్యమంతయు విశ్వామిత్రునకు ధారవోసెను. అప్పుడు విశ్వామిత్రుఁడా రాజును ఇఁకను చిక్కులఁ బడవేయవలెనని తానుమున్ను యజ్ఞమునకై కోరిన ధనమిమ్మని యడిగెను. ఆధనమిచ్చుటకు రాజు మునిని కొంతగడువు అడిగెను. విశ్వామిత్రుఁడు సమ్మతించి యాసొమ్మును తెచ్చుటకు రాజువెంటఁ దన శిష్యుఁడగు నక్షత్రకునిఁ బంపెను.

హరిశ్చంద్రుఁడు భార్యాపుత్రులతో రాజ్యమువిడిచి బయలుదేరెను. నక్షత్రకుఁడు వారిని మార్గమధ్యమున అనేక విధములఁ గష్టపెట్టెను. అబద్ధమాడుమని బోధించెను. కాని ప్రయోజనము లేకపోయెను. తుదకు హరిశ్చంద్రుఁడు కాశీపురమునుజేరెను. ముని ఋణమీయ వలసినదని యాతనిని

నక్షత్రకుఁడు బలవంతపెట్టసాగెను. అప్పుడు హరిశ్చంద్రుఁడు చంద్రమతిని కాలకౌశికుఁడను బ్రాహ్మణునకమ్మెను. తాను వీరబాహుఁడను మాలవానికమ్ముడువోయెను. ఈయమ్మకము వలన వచ్చిన సొమ్మిచ్చి హరిశ్చంద్రుఁడు నక్షత్రకుని బంపివేసెను.

హరిశ్చంద్రుఁడు వీరబాహుని యాజ్ఞమైన కాటికాపరియైయుండెను. కాలకౌశికుని యింటనున్న హరిశ్చంద్రుని కొడుకు దర్భలకైయరణ్యమునకుఁబోయి పాముచేఁ గఱవఁబడి మృతిఁ బొందెను. కొడుకును దహించుటకై యర్ధరాత్రి సమయమున చంద్రమతి యేడ్చుచు శ్మశానమునకువచ్చెను. అచ్చటనే హరిశ్చంద్రుఁ డుండెను. చంద్రమతీ హరిశ్చంద్రు లొకరినొకరు గురుతించి దుఃఖించిరి. హరిశ్చంద్రుఁడు కాటి సుంకమును దెమ్మని చంద్రమతిని పురములోనికిఁ బంపెను. విశ్వామిత్రుని పంపున గొందఱు చోరులు కాశీరాజ పుత్రుని జంపి, యాశవమును చంద్రమతి ముందుబడవైచి పాఱిపోయిరి. రాజభటులు చంద్రమతిని బట్టుకొని రాజు సన్నిధికిఁ గొనిపోయిరి. రాజు చంద్రమతి శిరమును ఖండించునట్లు ఆజ్ఞయిచ్చి వీరదాసుని కడకు పంపెను. నృపాలుని యాజ్ఞఁ దీర్పక తప్పదని తలంచి, యే పాప మెఱుంగని తనభార్యను జంపవలసి వచ్చినందులకు మిగుల

దుఃఖించి హరిశ్చంద్రుఁ డామెను నఱుకఁ బోయెను. ఆ సమయమున విశ్వామిత్రుఁడు వచ్చి హరిశ్చంద్రుని జూచి, "రాజా! నీ వసత్యమాడితివేని శుభములను బొందగలవు." అని పలికెను. "పుత్రుని చావునకైన సమ్మతింతును. భార్యనయిన ఖండించెదను. తుదకు నా ప్రాణమునైన గోలుపోయెదను. కాని యబద్ధమాడ"నని హరిశ్చంద్రుఁడు నిర్భయముగాఁ జెప్పి భార్యను వధింపఁబోయెను. అప్పుడ పార్వతీసహితుఁడై పరమేశ్వరుఁడు ప్రత్యక్షమై హరిశ్చంద్రుని సత్యమునకు మెచ్చి "ఇదియంతయు విశ్వామిత్రుని మాయ"యని చెప్పి, మృతులయిన లోహితాస్యుని, గా[illegible] రాజపుత్రుని బ్రదికించెను. విశ్వామిత్రుఁడు హరిశ్చంద్రు[illegible] ననేకవిధములఁ బొగడి, యాతని రాజ్యమాతనికిచ్చి వేసెను.

ఎన్ని వ్రతములయినను సత్యవ్రతమునకు సాటిరావు. సత్యవ్రతుడు మొదట కష్టములఁ బొందినను దుదకు సౌఖ్యములఁ గాంచి, పరమేశ్వరుని యనుగ్రహమునకు బాత్రుఁడగును.

